

**విలియమ్ బ్లేక్**
(1757-1827)

## చిత్రకారుని గురించి

విలయమ్ బ్లేక్ చాల మందికి కవిగానే తెలుసు. కాని అతడు ఆంగ్లేయ చిత్రాకారులందరిలోకి చాల అద్భుతమైన కళాభిజ్ఞత కలవాడు. అంతే కాదు చేయి తిరిగిన చిత్రకారుడు. అతడు సర్వ స్వతంత్రుడు. మొదట్లో అతడు వ్యాపార ప్రకటనలకే చిత్రించినా, తరవాత తరవాత ముప్పైల్లో తన పద్యాలనే చిత్రించడం మొదలు పెట్టాడు. అతడు తనదైన ఒక విలక్షణ శైలిని నిర్మించుకోగలిగాడు. అతడు ఒకరకమైన స్వప్న జగత్తును దర్శించేవాడు. అతడికి దేవతలు దేవలోకం నుంచి వచ్చి కనిపించిన అనుభవాలతనికి ఉన్నాయి. అలాంటి దృశ్యాలనే అతడు తరచు కంటూ ఉండేవాడు.

కాల్పనిక యుగంలో బ్లేక్‌ని చాల గొప్ప వానిగా గుర్తించారు కాని అతడి జీవిత కాలంలో అతడి మేదస్సును మెచ్చుకొన్న వారు, వెలకట్టిన వారు బహు కొద్ది మంది. అతడికి పోషకులు తక్కువ. జీవితంలో అధిక భాగం పేదరికంతోనే గడిపాడు. ఇహ సంపదల దృష్ట్యా తాను ఎంత ఉన్నతంగా ఆర్జించాననేది అతనికి ముఖ్యం కాదు. అతడు తన కళా చిత్రణకే అంకితమయ్యాడు. తనవైన ఊహాలోకాల్లో తేలిపోయాడు, ఈ "మాంస" ప్రపంచాన్ని కాదని. 1757 నవంబరు 28న లండన్‌లో బ్రాడ్‌స్ట్రీట్‌లో పుట్టాడు. 1782లో కాథరిన్ బేచర్‌ను పెళ్ళి చేసుకొన్నాడు. 1808లో మిల్లన్‌ను పూర్తి చేశాడు. 1825లో డాంటె డివైన్ కామెడీన్ మొదలెట్టాడు. 1827లో మరణించాడు.

### ముఖచిత్రం : ఆస్టార్టె సైరికా

డి.జ. రొసెటే 1828-82. బ్లేక్‌ని విపరీతంగా మెచ్చుకొనేవాడు. అతడు విద్యార్థిగా ఉన్నప్పడే అతడి రాతప్రతులను కొన్నాడు. ఇతడి మార్మిక ప్రతీకాత్మక వాదం మీద బ్లేక్ ప్రభావం కనిపిస్తుంది.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**


సంపుటి 14 | జనవరి 2003 | సంచిక 1

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**


## విషయ సూచిక




విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **ఆస్టార్ట్ సైరికా**

చిత్రకారుడు : **డి.జి. రొసెటీ (1828-82)**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# Are you a blushing kind ?

## Lifestyle Quiz

ARE you the blushing kind? Do you blush too readily, you often? Or maybe you don't seem to blush all that much remaining unflushed when others tingle and redden. Here's a novel quiz designed to get to the bottom of the blushing business as it affects you. Answer unblushingly the following round dozen questions, then size up the situation at the end. The conclusions may well prove surprising ... Each question requires a straight YES/NO answer.

1. Do you thing you blush as much as you parents did at the same age? YES/NO.
2. Do you find you can control the spread of a blush if you really try? YES/NO
3. Do you ever blush when you are alone? YES/NO
4. Sometimes people say " I blushed for him/her". Do you think this is really true? YES/NO
5. Have you ever seen a baby or every young child blush? YES/NO
6. Have you ever noticed a very old person blush? YES/NO
7. Have you ever found yourself blushing because other people are? YES/NO
8. Do you really believe women blush more readily than men? YES/NO
9. Do you find now you blush as frequently as you did when you were younger? YES/NO
10. Is feeling of "blushing all over" just a figure of speech, do you think? YES/NO
11. Some people believe that the blush is purely a habit of the fair-skinned, white races. Do you think they are mistaken? YES/NO
12. Is stupid to think that blushing is a sign of innocence, do you feel? YES/NO

Now sweep away all feelings of modesty, shame, guilt or embarrassment (all blush-provoking emotions), and see how you fared! Here are the correct answers and why :

1. NO. People are no longer socially expected to blush at things that would have embarrassed or shocked our parents, let alone our grandparents, so in that sense blushing is not so common as it once was.
2. NO. This is physically impossible. Once the blush-causing feeling has arisen in our reduce it. From that point on, a blush is as involuntary an act as a sneeze or a yawn.
3. YES, This is quite common, it usually occurs when we imagine ourselves in a situation where we would blush, and proves that blushing is not purely a social phenomenon.
4. YES. This is especially true if the person speaking is particularly close to the one he or she is feeling ashamed or embarrassed for.
5. NO. Blushing only starts when a child is old enough to have learnt to be ashamed of certain feelings and so feels the need to hide them from others. Psychologists put this at about the same age as a child starts to laugh at jokes.
6. YES. Once it starts, the ability (and the need) to blush continues throughout life, except that old people tent to blush less and less as they advance in years.
7. YES. It is quite normal for one to identify with a blushing person and so blush oneself. To that degree, blushing may be said to be catching!
8. NO. All research shows that the sexes blush equally readily. Of course, some girls and women find more to blush at in the world than do males.
9. NO. Blushing reaches its peak during adolescence and continues prominently until about age of 30, after which most people find the need to blush decreases year by year.
10. YES.- but the reddening may affect not only the face, ears and neck, but also the upper chest, the arms, and in extreme case the abdomen as well! "All over", however, is an exaggeration - fortunately!
11. YES. All races blush -white, yellow, brown and black.
12. YES. Obiously true innocence would not feel any need blush. Blushing as a sing of innocence and purity in women was a Victorian invention that the men found attractive. So the women tended to blush - as they were expected to, at almost everything!

***- Asia Features***

# అందంలో అంధ బిందువు

- అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

ఒకని మదిలో, స్త్రీని గురించి ఆలోచించినప్పుడు, మెదిలేది జాతి, మతం, సంస్కృతులు కావు. అందం. అయితే అందరు ఆడవాళ్ళు అదే అందంతో ఉండరు. అందాల స్థాయిలు మారతాయి. ఒకరి కంటె మరొకరు అందంగా ఉంటారు.

అందం అంటే కీట్స్‌కు 'సత్యం', లారెన్స్‌కు 'సారం', బ్లేక్‌కు 'సంతోషానందాలు', అస్కార్ వైల్డ్‌కు 'మేధస్సు' లేదా 'ఆనందం'. వారి దృష్టిలో అందం అలా ఉంటే, మనం దానిని వ్యాపారీకరణం చేశాము. స్త్రీ శరీరాన్ని అందంతో సమం చేసి పరిశ్రమను సృష్టించాము. మన వినిమయ సంస్కృతితో స్త్రీలను అంగడిలో వస్తు మార్పిడి సంబంధాల పరిధిలోకి తెచ్చాము.

ప్రపంచ మార్కెట్-ఈ స్త్రీల అందంచుట్టే పరిభ్రమిస్తుంది. లేకపోతే అది కుప్పకూలిపోతుంది. అందుకే ప్రపంచ, విశ్వ సుందరీమణుల పోటీలు నిర్వహిస్తున్నాము. ఏ వ్యాపార ప్రకటన చూసినా - చిరునవ్వు చిందించే ముఖం, ఆహ్వానం పలికే హొయలు. తదేకంగా చూసే కన్నులతో స్త్రీల ముఖాలు దేహాలు ఆ వస్తువులను కొనమని పిలుస్తుంటాయి. అంతేకాదు ఒకసాధారణ స్త్రీని అసాధారణ అందాల భామగా, సౌందర్య దేవతగా మార్చివేసే కొత్త ఫేస్‌క్రీమ్, లిప్‌స్టిక్, ఐ లైనర్‌లను మనలను కొనమని పిలుస్తాయి.

అసలు అందం అంటే ఏమిటి? దానికి కొలబద్దలేమిటి? అందం అందరికీ ఒకటేనా! అన్ని తరాలలో యుగాలలో ఒకేరీతిగా ఉందా? అనే ప్రశ్నలకు అందరూ అంగీకరించిన సమాధానాలు చెప్పలేం. ఒకప్పుడైతే మన సమాజంలో ఆడపిల్ల అణకువతో, గజ గామనిగా, ఆదర్శ గృహిణిగా, అనువర్తిని ఎదిగితే బాగుంటుందని భావించేవారు. ప్రబంధ కవులు అరటి బోదెలు లాంటి ఊరువులు (తొడలు), కుంభాలలాంటి స్తనాలతో, ఉన్నదా లేదా అనిపించే నడుముతో స్త్రీలుండాలని కోరేవారు.

యుగం మారింది. ఇప్పుడు స్త్రీలు కొంచెం ఎక్కువగానే పొడవుగా, పల్చని చట్రంతో, ఎత్తు మడమల పాదరక్షలతో, కుర్తాకమీజులతో ఉండాలని కోరుతున్నారు. కొంచెం సన్నగా, నాజూకుగా ఉండాలనే-ఈ తపనతో, ముక్కుల ఆకృతిని, స్తన పరిమాణాన్ని మార్పించుకొంటున్నారు. చర్మాన్ని చెక్కించుకొనే వరకూ వెళ్తున్నారు. కృత్రిమ గోళ్ళను, కనుబొమలను ధరిస్తున్నారు. సన్నబడడానికి కిడ్నీలు, లివరు దెబ్బతినేదాక ఉపవాసాలు చేస్తున్నారు.

అయితే అందం-ఈ బాధలన్నింటి కంటె విలువైనదే.

సౌందర్య ప్రమాణాలు సహజాలూ కావు, శాశ్వతాలూ కావు. స్త్రీ శరీరానికి, ఆమె కనిపించే తీరు (looks)కు వివిధ సంస్కృతులలో వివిధ తరాలలో వివిధంగా విలువ కట్టబడింది. చరిత్ర తిరగవేస్తే స్త్రీ శరీరాకృతిని మార్చడానికి ఎన్నోపాట్లు పడ్డట్లు తెలుస్తుంది. ప్రతి యుగంలోను సౌందర్యాన్ని నిర్వచించగల శక్తి సామర్థ్యాలు అధికారం ఉన్న ఏ కొద్దిమంది విశిష్టుల భావనకు సరిపోయేట్టుగా స్త్రీ శరీరాకృతిని మలిచే పన్నుగడలను, ఉపాయాలను రూపొందించడం జరిగింది. ఈ ఉపాయాలు కొన్నిసార్లు స్త్రీలకు బాధాకరంగా పరిణమించాయి.

చైనాలో ఆడపిల్లల పాదాలను పుట్టినప్పటి నుంచే పెరగకుండా కట్టివేశారు. వారి పాదాలను కవులు మూడంగుళాల బంగారు లిలీ పూలుగా వర్ణించేదాక పోయారు. ఆ ఆడవారు తమ బుల్లి పాదాల మీద

గాలికి అటు ఇటూ ఊగిసలాడే రెల్లు కాడలాగా నడుస్తుంటే వారికి చాల సుందరంగా ఉండేదట. యూంగ్ చాంగ్ అనే చైనా రచయిత్రి ఇలా రాసింది:

''మా అమ్మమ్మ పాదాలు, ఆవిడ రెండేళ్ళ వయస్సులో, బంధింపబడ్డాయి. ఆమె తల్లి పాదాలూ అంతే. 20 అడుగుల పొడవు గుడ్డ తీసుకొని బొటనవ్రేళ్ళు మినహాయించి మిగతా వ్రేళ్ళను పాదాలక్రిందికి వంచి కట్టారు. మా అమ్మమ్మ బాధతో విల విలలాడిందట. అరవకుండా ఆమె నోట్లో గుడ్డ కుక్కారట. ఈ ప్రక్రియ చాల కాలం సాగింది. ఎముకలు విరిగిన తరువాత గూడ, రేబవలు మందపాటి గుడ్డతో బంధించి ఉంచేవారట. ఆమె ఆమెతల్లితో మొరపెట్టుకొన్నప్పుడు, ఆమె గూడా దుఃఖంతో అనేదట: ''అలా కట్టకపోతే నీ జీవితం మొత్తం నాశం అవుతుంది. నీ మంచికే నేనిదంతా చేస్తున్నాను!'' ఆ చైనావాళ్ళ సంగతే కాదు. కాలిఫోర్నియాకు చెందిన కార్పెంటారియా మోడల్, నటి కావాలనుకున్నది. 125 పౌండ్ల బరువు నుంచి 98 పౌండ్లకు తగ్గడానికి ఆమె చేసిన ఉపవాసాల అవస్థ చైనా యువతులకు తీసిపోయిందికాదు. గంట-గాజుపాత్ర (hour glass = గాజు పాత్ర ఇసుక గడియారం) ఆకృతి ఆదర్శ ఆకృతిగా పరిగణించారు. ఆమె ఆ ఆకృతిని పొందడానికి నానా అవస్థలు పడింది. వివిధ సంస్కృతులు స్త్రీల అందాన్ని వేరు వేరుగా ఊహించాయి. మారుతున్న ఆర్థిక, సాంఘిక, రాజకీయ ప్రభావాలతో పాటు స్త్రీలు తమ ఆకృతులను మార్చుకోవలసి వచ్చేది. పూర్వ కాలపు రోములో స్త్రీ 'వక్రత' లు నచ్చేవి కావు. వారు తమ స్తనాలను బల్లపరుపుగా చేసుకోవడానికి వాటిని అణిచి బంధించి కట్టేవారు. పాశ్చాత్య దేశాలలో 1920లో టెన్నిస్ కోర్టు వక్షస్థలాలు ప్రాముఖ్యం వహించాయి. 1950లో స్తన శస్త్ర చికిత్స చేయించుకొని బ్రా సైజు పెంచుకొన్నారు. అనేకసార్లు ప్లాస్టిక్ సర్జరీ చేయించుకొన్న ఎలిజబెత్ టేలర్, ''ఈ గ్రహం మీదే 61 సంవత్సరాల అత్యంత సౌందర్యవతి'' అయింది (ఆమెకు 61 సంవత్సరాల వయస్సులో). సౌందర్య భావనలు ఒక వర్గానికి ప్రయోజనకరంగా తయారవుతాయి. అందం యుగ భావనల మీద ఆధారపడుతుంది. పాశ్చాత్య సౌందర్య భావనలు అభివృద్ధి చెందుతున్న దేశాలకు దిగుమతి అవుతున్నాయి. సౌందర్య విఫణికి ఈ దేశాలు మంచి మార్కెట్టు అవుతున్నాయి. ఈ దేశాల్లో ఆడపిల్లలను ''గంట - గాజు పాత్ర'' (hour - glass) రూపం గ్రహించేట్టు భావ ప్రసార యంత్రాంగం వార్తా మాధ్యమం కృషిచేస్తున్నాయి. స్త్రీ శరీరం ప్రకార్యకం (functional). గర్భిణిని, సాధారణ స్త్రీని అందానికి ఆధునిక ఆదర్శ ప్రతిమలని ఎవరూ అనరు. సహజంగా ఉన్న స్త్రీలు అందాల పోటీలో పాల్గొనే అవకాశమే లేదు. కనుబొమలు దిద్దుకోవాలి, కృత్రిమ కనుబొమలు అవసరమైతే ధరించాలి. స్తనాలను కావలసిన రీతిలో మలచే శస్త్ర చికిత్స చేయించుకోవాలి. మేకప్‌తో మన కళ్ళు జిగేల్‌మనాలి. మామూలుగా నడవరాదు cat walk చేయాలి. అందమైన ముడులు చుట్టాలి. రకరకాల దుస్తులు ధరించాలి. ఇలాంటి మోసపూరిత క్రతువును బహు నాజూకుగా నిర్వర్తించాలి.

ఈ సౌందర్య సిద్ధాంతం స్త్రీలను ఏ విధంగా ప్రభావితం చేస్తుంది? ముందుగా వారి అంతస్తు హోదా పడిపోతుంది. శరీరం జీవశాస్త్రంగా పరివర్తితమై, ఆ తరవాత అది 'వస్తువు' అయిపోతుంది. అలా 'వస్తువు'గా మారింది కనుక దానిని అంగడిలో అమ్ముకోవచ్చు లాభం కోసం. అంతేకాదు, స్త్రీలు గర్వంగా చెప్పుకోవడానికి ఈ శరీరం (వస్తువు) తప్ప మరేమి లేని స్థితికి దిగజారిపోతారు, వారు సామాజికంగా ఎంతటి ఉన్నత అంతస్తులో ఉన్నా. కేవలం ఆమెను ''అందాలకే'' (చూపులకే = looks) పరిమితం చేస్తే ఆమె 'విలువ' పడిపోతుంది (మారకం విలువ కాదు). అలా అయినప్పుడు పురుషులు స్త్రీలను తమ సహచరులుగా, బౌద్ధిక (intellectual) మిత్రులుగా అంగీకరించలేరు.

నీచీ (Nietzsche) అన్నాడు: ''ఒక స్త్రీ ఏదైనా నేర్చుకోవాలనుకొంటున్నదంటే ఆమె సెక్స్‌లో ఏదో లోపమున్నదన్నమాట''. అంతకంటె ఓ అమ్మాయి తన శరీరాన్ని కాక 'మనస్సు' (mind) ను ప్రదర్శిస్తున్నదంటే ఆమెను శిక్షించాలి. ఒక అమ్మాయి వింటూ కూచోక, మాటాడడం మొదలు పెడితే ఆమెను భద్రమహిళగా పరిగణించరు. అందుకనే మేరీ వ్రొర్ట్లే మాంటేగ్ తన కూతురికి సలహా ఇచ్చింది, అందరి తెలివైన తల్లులు లాగే: ''నీ తెలివి తేటల్ని ఒక శారీరక లోపాన్ని ఎలా కప్పి పెట్టుకొంటామో, అలా దాచిపెట్టుకో''. అందుకేనేమో జేన్ మేన్స్ ఫీల్డ్ తన 166 I.Q. ను దాచిపెట్టుకొంది.

స్త్రీకి తెలివి తేటలు ఎంతగా ఉన్నా, ఆమె నాటి సంస్కృతి ప్రమాణాలకు దరిదాపుల్లో ఉండడానికి ప్రయత్నించాలి. ఒక కార్పొరేషన్‌కు వైస్ ప్రెసిడెంట్‌గా ఎన్నికైన ఒక యువతిని, ఆమె శక్తి సామర్థ్యాలను చూసిగాక, ఆమె జైవిక ప్రమాణాలను 34-24-36 చూసి పత్రికల వాళ్ళు మెచ్చుకొన్నారు 1966లో.

కాబట్టి స్త్రీలు ఒక విషయం నేర్చుకోవలసి వచ్చింది: సమాజం రూపొందించిన సౌందర్య ప్రతిమకు దరిదాపుల్లో లేకపోతే ఎంత తెలివితేటలున్నా ప్రయోజనం శూన్యం అని భావించే దశకొచ్చారు. ఆ విధంగా మానసికంగా వారు తమ ''శరీరాలకు బాహ్యులై'' న్యూనతా భావనకు గురవుతున్నారు.

మగవారిని సంతృప్తి పరిచే మేరకు మాత్రమే ''స్త్రీ శరీరం విలువైంది. వాస్తవంగా అయితే ఒకని శరీరం అతని సమగ్రతను, వేరే వ్యక్తిగా, ఇతరుల కంటె వేరుగా ప్రతిష్ఠిస్తుంది. శరీరం ద్వారానే సెక్సువాలిటీ జెండరుతో ఐక్యమయ్యేది. కాని 'అందం' అనే జెండా క్రింద హీనమైన అశ్లీల ప్రకటనలు, నృత్యాలు, సంభాషణలు- అన్నీ ప్రదర్శితాలవుతున్నాయి. ఈ విధంగా స్త్రీ శరీరాన్ని మార్కెట్‌లో లాభదాయకంగా వాడుకోవడం జరుగుతుంది.

అన్నింటికంటె విచారకరమైన విషయం ఏమిటంటే, సమాజం వారి మీద ఏది రుద్దితే దానిని ఔదాల దారుస్తున్నారు. వారు వారేమిటో గుర్తించలేక పురుషుల నుంచి ఒక నమూనాను, ఒక పద్ధతిని కోరుకొంటున్నారు. ఈ ప్రపంచంలో ఉండడమంటే, స్త్రీలు ''శరీరం-సౌందర్యం''ల మధ్య సంబంధంతో కండిషన్ అవుతున్నారు. తమకు తాము ఏ విధంగా ''సంబంధింప'' చేసుకొంటున్నారు? అలాగే తమకు తాము ఎటువంటి గుర్తింపు (identity)ను నిర్మించుకోగలుగుతున్నారు? ఈ రెండింటి మధ్య నలిగిపోతున్నారు. వారి ''సంబంధితత్వం'' (relatedness) ''గుర్తింపు''లను వెలుపలి ఏజెంట్లు - పెద్ద పెద్ద వాణిజ్యవేత్తలు - అందాన్ని బహుళ డాలరు పరిశ్రమగా మార్చగల వణిజులు - నిర్మిస్తున్నారు.

ఇకనైనా స్త్రీల యెడ పురుషుని దృష్టి మారాలి. స్త్రీలను వస్తువులను చేస్తే పురుషుడు వస్తువైపోతాడు. అబ్రహాం లింకన్ అన్నాడు: ''బురదలో ఉన్న వానిని పైకి లాగడానికి నీవు బురదలో దిగాలి''

అందుకని ''సౌందర్యం మాయను'' - ముసుగును చీల్చి, స్త్రీలను వారి అందాలు చూసికాక, వారి శక్తి సామర్థ్యాలను గౌరవించడం నేర్చుకోవాలి. అందం మాయలో పడడం ఒక సాంస్కృతిక ఉన్మాదం. దాని స్పర్శ జంతుసమం. వినాశకరం. దొంగతనం - చివరకు మరణ సదృశం - అది మానవ ప్రతిష్ఠ మరణం.

# క్రైస్తవం-పెగనిజమ్

## (1921వ సంవత్సరపు నోబెల్ సాహితీ పురస్కార స్వీకారోపన్యాసము)

మూలం: అనటోల్ ఫ్రాన్స్ అనువాదం: ముదిగొండ శివ కౌముది దేవి

నా జీవితపు సాయంకాల దినాలలో - ఈ ఆఖరిదశలో ధైర్యవంతులైన పురుషులనీ, సౌందర్యవతులైన స్త్రీలనీ వెలికి తెచ్చిన మీ సుందర దేశాన్ని సందర్శించే అవకాశం లభించినందుకు సంతోషిస్తున్నాను. నా సాహిత్య జీవితంలో మకుటాయమానం అనతగిన ఈ పురస్కారాన్ని కృతజ్ఞతతో అందుకుంటున్నాను. ఉత్తమమైన జడ్జీల నిర్ణయంతో, ఉన్నత వ్యక్తి స్థాపనతో ఏర్పడిన ఈ బహుమానాన్ని - నిరుపమాన బహుమతిని అందుకుంటున్నాను. ఫ్రెంచ్ అకాడమీ సభ్యుడిగా గతంలో మీచే ఆహ్వానించబడి నేను నోబెల్ సాహితీ పురస్కారాన్ని ప్రదానం చేయడంలో మీకు సహకరించి ఉన్నాను. నోబెల్ సాహితీ పురస్కార ప్రదానానికి సలహా ఇచ్చే భాగ్యం నాకు కలిగింది.

అద్భుతశైలి కలిగిన మేధావి మీటర్‌లింక్ - న్యాయ కాముకుడు, శాంతి కాముకుడు, ఒక మంచి వ్యక్తిగా ఉండటంకోసం అప్రతిష్టను అధిగమించిన రోమెయిన్ రోలాండ్‌ల విషయంలో నేను సలహాదారుగా ఉన్నాను.

ప్రస్తుతం నేను నార్వే శాంతి బహుమతి గురించి మాట్లాడితే పొరపాటు కాదనుకుంటాను. నార్వేజియన్ స్టోర్టింగ్ శాంతి బహుమతికి చేసిన ఎన్నిక చలా మెచ్చదగినది. మీరు బ్రాంటింగ్‌ని గౌరవించడం ద్వారా ఒక రాజనీతిజ్ఞుడిని, ఒక న్యాయ కోవిదుడిని గౌరవించారు. ప్రజల గమ్యాలు అటువంటి వ్యక్తులచే నిర్ణయించబడతాయా? యుద్ధాలలోకెల్లా భయంకరమైన యుద్ధం తర్వాత ఒక శాంతి ఒప్పందం జరిగింది. కాని ఆ శాంతి ఒప్పందం కూడా యుద్ధానికి కొనసాగింపు వంటిదే. మంత్రుల మధ్య సామాన్యమైన జ్ఞానం ప్రవేశిస్తే తప్ప యూరప్‌ని రక్షించడం కష్టం. యూరప్‌లోని దేశాల మధ్య సయోధ్య, ఐక్యత ఏర్పడాలని కోరుతూ మీ వంటి ధైర్యవంతులు, వివేచన, విశ్వాసపాత్రత కలిగిన వారి ప్రభావం వల్ల ''మంచి'' వర్ధిల్లుతుందని ఆశిస్తున్నాను.

అధికారిక రికార్డుల్లో ఈ క్రింది సంఘటన జరిగినట్లుగా ఉన్నది : అనటోల్ ఫ్రాన్స్ రాజుగారి హస్తాల మీదుగా నోబెల్ బహుమతి అందుకున్న తర్వాత సభకుల మనసులని గాఢంగా ప్రభావితం చేసిన ఈ సంఘటన జరిగింది. ఈ మేధావి అయిన రచయిత వేదికపైన కెమిస్ట్రీలో నోబెల్ బహుమతి గ్రహీత అయిన ప్రొఫెసర్ వాల్తెర్ నెర్న్‌స్ట్‌తో దీర్ఘసమయంపాటు కరచాలనం చేసారు. ఈ ఫ్రెంచి మనిషి, చివరి శాస్త్రీయవాది, జర్మన్ సైంటిస్ట్, ప్రఖ్యాత శాస్త్రవేత్త - రెండు దీర్ఘకాలిక శత్రు దేశాలకు చెందిన వారు ఒక కరచాలనంతో ఐక్యమయ్యారు. ఇదొక గుర్తుండిపోతగిన ప్రముఖ సంఘటన.

ఒకరితో ఒకరు అనేక సంవత్సరాలు పోరాడుకున్న ఈ దేశాల వ్యక్తుల కరచాలనానికి ప్రేక్షకులు కరతాళధ్వనులు చేసారు.

---

ముదిగొండ శివ కౌముదిదేవి, ఫ్రీలాన్ జర్నలిస్టు, వరంగల్

**బహుమతి సమర్పణ : ఇ. ఎ. కార్ల్‌ఫెల్డ్,** స్వీడిష్ అకాడమీ శాశ్వత కార్యదర్శి

1881లో ఫ్రాన్స్ దేశపు సాహిత్యాభిమానుల దృష్టిని ఆకర్షించినపుడు అనటోల్‌ఫ్రాన్స్ మరీ కుర్రవాడేమీ కాదు. ''లేక్రైమ్ డీ సిల్వెస్టర్ బొనాడ్'' అనే ఆసక్తికరమైన నవల ద్వారా అతడు నాగరిక ప్రపంచం అంతటినీ ఆకర్షించాడు. అతడు వైవిధ్యభరితమైన అంశాలపై అనేక రచనలు చేసాడు. అతనికి కీర్తికాంక్ష పెద్దగా లేకపోయిది. ఆశయం అతని జీవితంలో చిన్న స్థానమే పొందింది. అతడు చెప్పినదాన్ని బట్టి తన బాల్యంలో ఏడవ ఏట, తన తల్లి చెప్పిన మహనీయుల గాథలు విని అతనూ ప్రసిద్ధుడవ్వాలని, సన్యాసం స్వీకరించాలనీ అనుకున్నాడు. ఇది గమనించి అతడి తల్లి భయపడినా, తండ్రి మాత్రం ఆవిడకి ''ఇరవై ఏళ్ళు వచ్చేసరికి అతడికి ప్రఖ్యాతంటే విసుగు కలుగుతుంది'' అని ధైర్యం చెప్పేవాడు.

తన తండ్రి పొరపాటు పడలేదని ఫ్రాన్స్ అంటాడు. వయసు పెరుగుతుంటే తనలో ప్రసిద్ధుడైన వ్యక్తి కావాలనే కోరిక తగ్గిపోయిందని, రోజు రోజుకీ అది రూపాంతరం చెంది దైనందిన జీవితంలో విభిన్న సందర్భాలను అర్థం చేసుకునేలా దోహదం చేసిందనీ ఫ్రాన్స్ అంటాడు.

పదిహేనవ యేట తన తొలి వ్యాసాన్ని రాసిన అనటోల్ ఫ్రాన్స్ దానిని తన తల్లిదండ్రులకు అంకితం చేసాడు. ఆ వ్యాసం ప్రస్తుతం అలభ్యం. ఆ తర్వాత సెయింట్స్ (సన్యాసులు) పట్ల అతడి విశ్వాసం మటుమాయమైన తర్వాత కూడా అతడు గుర్తుండి పోతగిన లెజెండ్స్ అనతగిన రచనలు చేసాడు.

అనటోల్ ఫ్రాన్స్ అని పేరు మార్చుకోవడంతోనే ఆ యువ కవి దశ మారిందని చెప్పవచ్చు. తన తండ్రి గ్రంథాలయంలోని పాత పుస్తకాలు అతనిలో జ్ఞాన తృష్ణను పెంచాయి. ''ఆక్స్ ఆర్మ్స్ డిఫ్రాన్స్'' అనే ఆ పాత పుస్తకాల దుకాణమే అనటోల్ ఫ్రాన్స్ పేరు ఆ విధంగా మార్చుకోవడానికి స్ఫూర్తి ఇచ్చింది. ఆ షాపులోకి పుస్తకాల సేకరణ కర్తలు, పుస్తకాభిమానులు వచ్చేవారు. రచయితలు, గ్రంథాల గురించి జరిగే చర్చల్లో అతడు మంచి శ్రోతగా ఉండేవాడు. జ్ఞాన సముపార్జనను అతడు జీవితమంతా అత్యున్నత ఆనంద దాయినిగా భావించాడు. హాలండ్ నుంచి తరచూగా వచ్చే క్రొత్త గ్రంథాలతో అతనికి పండుగలా గడిచేది.

అనటోల్ ఫ్రాన్స్ ప్రఖ్యాత పాత్ర అబీ కొయినార్డ్ కూడా భౌతికావసరాల కోసం ఒక యువకుడికి (మాంసం వండే యువకుడు) పాఠాలు చెప్పేవాడు. క్రిస్టియన్ మత విశ్వాసం, వివేకం, వ్యంగ్యం మేళవించి ఆ పాఠాలుండేవి. మిస్టర్ బెర్గరెట్ అనే పాత్ర కూడా వచ్చేది. ఆ లైబ్రరీ మేధావుల మయంగా ఉండేది. అబీకొయినార్డ్ అనేవాడు - ''ఒక టేబిల్ వద్ద కూర్చుని విభిన్న రకాల పుస్తకాలతో సంభాషించడాన్ని ఇష్టపడతాను - మనుష్యులతో సంభాషణ కన్నా'' - అని. ''జీవించడానికి ఎన్నో విధానాలున్నాయి, అయితే వాటన్నింటికన్నా నేను చదవటాన్నే ఉత్తమమైనదిగా భావిస్తాను. జీవితపు ఎత్తుపల్లాల్లో వ్యక్తులు తమను తాము సమర్థించుకుని ధైర్యం చెప్పుకోవటానికి, శతాబ్దాల కాలంలో నుంచి, రాజ్యాల నుంచి మన క్లుప్తమైన జీవితకాలాన్ని పొడిగించుకోవడానికి పఠనం అత్యంతాసక్తి దాయకమని నేను నమ్ముతాను'' అని కూడా కొయినార్డ్ అన్నాడు.

మేధో పరమైన పనులంటే అనటోల్ ఫ్రాన్స్‌కు వ్యక్తిగతంగా ఎంతో అభిమానం. అబీ కొయినార్డ్‌లాగే విజ్ఞానం, ఆలోచనల హర్మ్యంలోనుంచి ప్రపంచాన్ని, వివిధ సమయాలను చూడటానికి అనటోల్ ఇష్టపడేవాడు. అతడి భక్తి గతంలో ఉంటే వ్యంగ్యం వర్తమానంలో ఉండేది.

మన ఉనికి ఎంత బలహీనమైనదైనా, సౌందర్యం ఆ స్వల్ప బలహీనమైన ఉనికిలో కూడా ఉంటుంది, ప్రతి చోటా ఉంటుంది. రచయితలకి సౌందర్యం వారి రచనా శైలిలో, శిల్పంలో ఉంటుంది. అనటోల్ ఫ్రాన్స్ విస్తృత పఠనం వల్ల, ఏకాగ్రతవల్ల అతని రచనలలో ఒక ఘనత ఏర్పడింది. తన రచనా శైలిని ఉత్తమంగా తీర్చిదిద్దుకోవడానికి అతను తక్కువ కృషిచేయలేదు. అత్యంత యోగ్యమైన, ఉత్తమమైన భాషను అతను ఉపయోగించేవాడు. లాటిన్ భాషనుంచి పుట్టిన భాషలో ఉన్నతిని పొందిన భాష ఫ్రెంచ్. ఉన్నతోన్నతమైన వ్యక్తులు ఫ్రెంచ్‌లో రచనలు చేయటానికి ఆ భాష ఉపయోగపడింది. వేదన, ఉత్సాహం, కళ, ప్రశాంతత, శక్తి, శ్రావ్యత అన్నీ ఫ్రెంచ్ భాషలో ఉన్నాయి. అనటోల్‌ఫ్రాన్స్ అనేక సందర్భాలలో భూమిపై పుట్టిన అత్యుత్తమ భాష ఫ్రెంచ్ అన్నాడు. అత్యంత సున్నితమైన విశేషణాలు, అలంకారాలతో ఆ భాషను ప్రేయసిలా అలంకరించాడు.

అతడు ఉత్తమ కళాకారుడు, అయితే అతడి కళ అతడి భాషని సాధ్యమైనంత సరళంగానూ, అభివ్యక్తంగానూ ఉండేలా చూసింది. ఆ విషయంలో అనటోల్ ఫ్రాన్స్ పూర్వ కవుల వారసుడే. అతడి సమకాలీన యూరోప్‌లో అపరిపక్వత వృద్ధిలో ఉన్న సమయాలలో అనటోల్ ఫ్రాన్స్ చేసిన రచనలు ఉత్తమ రచనకు ఉదాహరణలుగా నిలచేయి. వోల్టేర్, ఫెనెలోన్ వంటి వారు వ్రాసిన శాస్త్రీయమైన ఫ్రెంచ్‌నే అనటోల్ ఫ్రాన్స్ రాసాడు. ఆ శాస్త్రీయమైన భాషకు తనదైన ముద్రనుజోడించి ఆధునిక అలంకరణలు ఏమీ చేయకుండానే తన కథా వస్తువులకు అనుగుణమైన భాష అతడు వ్రాసాడు. (అతడి కథా వస్తువులు సాధారణంగా ప్రాచీనమైనవిగా ఉండేవి). అతడి పాత్రల గురించి పారదర్శకమైన భాష వ్రాసాడు.

అనటోల్ ఫ్రాన్స్ భాషగురించి అతనే వ్రాసిన, అతని పాత్రలకు సంబంధించిన ఒక వాక్యం జ్ఞప్తికి వస్తుంది (లేలా, లిలిత్ కుమార్తె - అనే పాత్ర గురించి) ''స్ఫటికం మాట్లాడగలిగితే ఈ విధంగా మాట్లాడుతుంది'' - అని.

అనటోల్ రచనా చక్రవర్తిగా - కథా చక్రవర్తిగా పేరొందాడు. అత్యుత్తమ యోగ్యతలు, ఉన్నత ఫలితాలనిచ్చే ఉత్తమ రచనా శక్తి, కథా సంవిధానం, కల్పనా చాతుర్యం, వ్యంగ్య వైభవం, భావోద్వేగాల వ్యక్తీకరణలతో అనటోల్ ఫ్రాన్స్ రచనా చక్రవర్తిగా పేరొందాడు. అనేక మంది ఇతరుల లాగా అనటోల్ ఫ్రాన్స్ తన పాత్రలు, వాక్యాల వెనక దాగి ఉండటానికి ఇష్టపడడు. ఆయన రచించిన 'బాల్తజార్' మరపురాని రచన, ఇథియోపియాకు చెందిన నీగ్రోరాజు క్వీన్ ఆఫ్ షెబాబల్కిస్ సందర్శనం కోసం వెళ్తాడు. అక్కడ క్వీన్ ప్రేమనుగెలుచుకుంటాడు. కానీ చంచల మనస్కురాలైన రాణి త్వరలో అతడిని తిరస్కరించి, మరొకరిని ప్రేమిస్తుంది. శారీరకంగా, మానసికంగా అమితంగా గాయపడి బాల్తజార్ (నీగ్రోరాజు) తన దేశానికి తిరిగి వెళ్తాడు. జ్యోతిష్య శాస్త్రంలో ప్రవేశం సాధిస్తాడు. అకస్మాత్తుగా అతడి విచార ఉద్విగ్న హృదయంపై ఒక ఆశ్చర్యకరమైన వెలుగు ప్రసరిస్తుంది. బాల్తజార్ ఒక కొత్త నక్షత్రాన్ని కనుగొంటాడు. ఆ నక్షత్రం అత్యున్నత వ్యవస్థలో అతడితో సంభాషిస్తుంది. ఆ నక్షత్రం వెదజల్లిన కాంతిలో అతడు ఇరుగు పొరుగు రాజు లిద్దరితో చేరుతాడు. క్వీన్ ఆఫ్ షెబా బల్కిస్ ఇక ఏమీ చేయలేదు. బాల్తజార్ ఆత్మ భౌతిక సుఖాల నుండి, శారీరక సుఖాల నుండి విముక్తి చెందింది.

బాల్తజార్ ఆ నక్షత్ర మార్గాన్ని, ఆ తార బోధించిన పథాన్ని తన మార్గంగా ఎంచుకుంటాడు. ముగ్గురు జ్ఞానులకు జెరూసలెంలో దారి చూపిన నక్షత్రమే ఈ నక్షత్రం కూడా.

అనటోల్‌ఫ్రాన్స్ మరో సందర్భంలో మన కళ్ళముందు రత్నాలభరిణవంటి పాత్రలనే ఉంచుతాడు. ఈ సందర్భంలో ఫ్రాన్స్ కొంత వ్యంగ్య భరితమైన రచనే చేసాడనుకోవచ్చు. వృద్ధ సన్యాసి, యువ దేవతలతో కలసి ఈస్టర్ అలెలూయా గానం చేయడం; తదితర సన్నివేశాలు అత్యంతాసక్తి కరంగా రచించాడు. ఈ కథా సందర్భంలో అనటోల్‌ఫ్రాన్స్ తనదైన ఒక వ్యవస్థలో - ఒక ప్రపంచంలో ఉన్నట్లు కనిపిస్తాడు. ఆ ప్రపంచం క్రైస్తవమతానికి, పేగనిజం (క్రైస్తవేతర మతం) కు మధ్య ఉన్నట్లు కనుపడుతుంది. ఆ ప్రపంచంలో సంధ్యాకాంతి ఉదయం కలిసినట్లుగా; మత ప్రబోధకులు దేవతలతో కలుస్తూ; మాట్లాడుతూ; పవిత్రమైన జంతువులు, ప్రాణులు అపవిత్రమైన ప్రాణులతో కలుస్తూ; కలిసి తిరుగుతూ; రచయిత ఊహాశక్తి, కల్పనా చాతుర్యం; ఒక ఫాంటసీ రూపాన్ని పొందటం మనం చూస్తాం. కొన్నిసార్లు అటువంటి రచనను ఫిక్షన్ అనాలో, కల్పన - కల్పిత గాథ అనాలో, వాస్తవం అనాలో తెలియనంత వాస్తవికంగా కూడా ఉంటుంది.

మరో సందర్భంలో ఫ్రాన్ ప్రణయనైతికతను వర్ణిస్తాడు. సెయింట్ ఒలివెర్, లిబరెట్; యుఫ్రోజిన్, స్కోలాస్టికాల పాత్రలద్వారా. సెయింట్స్ కథల నుండి స్వీకరించిన ఈ పాత్రలను ప్రతిభావంతంగా చిత్రించాడు అనటోల్‌ఫ్రాన్స్. మరొక కథలో అనటోల్‌ఫ్రాన్స్ సెయింట్ ఫ్రాన్సిస్, ఆయన ఆత్మపుత్రిక సెయింట్ క్లైయిర్‌ల గురించి వ్రాసాడు. జుపిటర్, సాటర్న్‌ల వంటి వారివద్ద ఉన్న హూలీసెటైర్ గురించి కూడా సమర్థవంతంగా వర్ణించి ఉత్తమశైలిలో రచించాడు.

అనటోల్‌ఫ్రాన్స్ రచించిన మరొక ప్రఖ్యాత నవల 'థెయిస్' (1890). హెలెనిక్ నాగరికత ఆఖరి వారులపై క్రైస్తవ మతం పరివ్యాప్తి చెందుతున్న కాలంలో అలెగ్జాండ్రియన్ ప్రపంచంపై అనటోల్‌ఫ్రాన్స్ ఉత్సాహభరితంగా చేసిన లోతైన విశ్లేషణ ఈ నవల.

తీవ్రమైన వ్యక్తిగత క్రమశిక్షణ గల సన్యాసి ఆశ్రమాలు ఒక ప్రక్క; మరో ప్రక్క భౌతిక సుఖాల ఆకర్షణ, పరిఢవిల్లిన కాలమది. మిస్టరీలు, కళాత్మకతలు సమాంతరంగా వర్ధిల్లిన కాలమది. దేవతలు, రాక్షసులు సమాంతరంగా ఉండి మానవ ఆత్మల గురించి చర్చి ఫాదర్లు; నియోహెలెనిక్‌మత తత్త్వవేత్తలు భేదాభిప్రాయాలు వ్యక్తం చేసినకాలం, అదీ కథకాలం. కథ ఆనాటి నైతిక వ్యతిరేకత చుట్టూ తిరుగుతుంది. అయినా కథలో చక్కటి ఎడారి వర్ణనలున్నాయి. సన్యాసులు, సాధువుల ప్రసంగాలు, లేదా సమాధుల్లో పీడకలలు వర్ణితమయ్యాయి.

అయినప్పటికీ అనటోల్ ఫ్రాన్స్ నవలలన్నింటిలోకీ 'రెన్‌పెడాక్ సంతకంతో' అనేది అత్యుత్తమమైనదిగా భావించవచ్చు. ఈ పుస్తకంలో జీవితానికి దగ్గరగా ఉండే వాస్తవికమైన పాత్రలని అనటోల్ ఫ్రాన్స్ సృష్టించాడు అబీ కొయినార్ పాత్ర ఎంత వాస్తవికంగా చిత్రించాడంటే మనం ఆ పాత్రం వాస్తవికతని పరిశీలనచేయవచ్చు. ఏకాంతంలో పరిశోధిస్తే ఆ పాత్ర తన సంక్లిష్టతలను బహిర్గతం చేస్తుంది. ఇతరులకు కూడా బహుశా నాకు కలిగిన అనుభవమే కలిగి ఉండవచ్చును.

ఈ పాత్ర పట్ల నాకు మొదట్లో అతిస్వల్పమైన సానుభూతి కూడా ఉండేది కాదు. అసభ్యంగా, జుగుప్సాకరంగా ప్రవర్తిస్తూండే ఆ పాత్ర; తన ఆత్మగౌరవాన్ని పట్టించుకోకుండా ఒక్కోసారి

దొంగతనాలకి కూడా పాల్పడుతూ; అటువంటివే మరికొన్ని, ఇతర జుగుప్సాకరమైన నేరాలు చేస్తూండే ఆ పాత్ర; అతి వాగుడుతో మత బోధనలు చేస్తుండే పాత్ర; చేసిన నేరాలని అంతరాత్మ ప్రబోధాలతో కప్పిపుచ్చుకుని సమర్థించుకునే పాత్ర ఆ పాత్ర. కాని బాగా పరిచయమైన కొద్దీ ఆ పాత్ర మెరుగవుతుంది. ఆ విధంగా ఆ పాత్రని నేను బాగా పరిచయమైన కొద్దీ ప్రేమించడం ప్రారంభించాను. అతడు తెలివైన, హేతుబద్ధమైన తార్కికుడే కాదు; అనంతాశ్చర్యం కలిగించే వ్యంగ్య సంభాషకుడు. ఇతరులపైనే కాదు తనపైన కూడా తాను వ్యంగ్య వ్యాఖ్యలు చేస్తాడు. అతడి ఉద్దేశ్యాలకూ, జీవిత విధానానికీ మధ్య అద్భుతమైన హాస్యం ఉంది. అతడి పాత్ర సృష్టికర్తకున్న సహనంతో, చిరునవ్వుతో అతడిని మనం గౌరవించాలి. సమకాలీన సాహిత్యంలో కొయినార్డ్ ఒక గొప్ప చెప్పుకో తగిన పాత్ర. ఉత్తమ హాస్య రచనలో ఒక క్రొత్త ఒరవడి.

ఆస్టరాక్‌కు చెందిన కెబలిస్ట్ (కుట్రదారు) పాత్ర కూడా ఇదేవిధంగా వినోదభరితంగా తీర్చిదిద్దబడిన పాత్ర. పద్దెనిమిదివ శతాబ్దికి తగిన పద్ధతిలో వ్రాసిన కథా సంవిధానంలో ఈ ఐంద్రజాలికుడి పాత్ర అవసరం గ్రహించవచ్చు. ఈ ఐంద్రజాలికుడు సృష్టించే పాత్రలు మాత్రం అధివాస్తవికమైనవి. దేవతలు, వింత జంతువులు - మానవ బంధాలకు అతీతమైనవి. ఈ పాత్రల తెలివితేటలని నిరూపించడానికా అన్నట్లు ఐంద్రజాలికుడు ఒక ఉదాహరణ కూడా చెబుతాడు. రాణి క్రిస్టీన్‌కు తత్త్వశాస్త్రం బోధిస్తూ ఉన్న డిస్కార్టెస్‌కు ఒక దేవత (ఫెయిరీ) ఒక ఫ్రెంచి పండితుడి నుండి సందేశం మోసుకెళ్తుంది - స్టాక్‌హూంకి. మూఢనమ్మకాలకు ఖచ్చితమైన వ్యతిరేకి అయినా అనటోల్‌ఫ్రాన్స్ తన రచనల్లో సూచన ప్రాయంగా ఉపయోగించుకున్నందుకు మూఢ నమ్మకానికి కృతజ్ఞుడై ఉండాలి.

అబీ కొయినార్డ్ విద్యార్థి, మాంసం వండేవాడు (స్పిట్‌టర్నర్). ఈ ఇబ్బందికరమైన సంఘటనలన్నింటినీ ఒక నిదానంతో జ్ఞాపకం చేసుకుంటూ వివరిస్తాడు. ఎటువంటి చరిత్ర కలిగి ఉన్నా; ఎటువంటి ప్రవర్తన కలిగి ఉన్నా అబీకొయినార్డ్ పట్ల విద్యార్థికి గురు భక్తి ఉంది. తన టీచర్ చివరి క్షణాల వరకూ దుష్టశక్తులతో పోరాడి సతమతమై చర్చిలో మరణించడాన్ని ఆ విద్యార్థి వివరిస్తాడు. ఆ తర్వాత అక్కడ ఆ విద్యార్థికి అబీ గుణగణాలను, వివేకాన్ని, విలువలను ప్రశంసిస్తూ లాటిన్ భాషలో ఒక పత్రం లభిస్తుంది. రచయితే తను తరువాత కాలంలో వ్రాసిన మరో పుస్తకంలో ఈ ప్రముఖ నాయక పాత్రకి నివాళులు, శ్రద్ధాంజాలి అర్పిస్తాడు. ఆ పాత్రని ఒక భోగలాలసత కల వ్యక్తిత్వానికీ, ఒక సన్యాసి ఆశ్రమ వాసి మనస్తత్వానికి మధ్యస్తంగా చిత్రీకరించిన రచయిత ఆ పాత్ర విమర్శనాత్మకతనూ, వ్యంగాన్ని గురించి చెబుతాడు. మతపరమైన కోణాన్ని ప్రక్కన పెడితే ఆ పాత్ర చిత్రణ అనటోల్‌ఫ్రాన్స్‌కే సరిగా పోలుతుంది.

మనం భయపడకుండా అతడిని (అనటోల్‌ఫ్రాన్స్‌ని) వెన్నంటి వెళ్దాం. భోగలాలసతల వనంలో వేదాంతపు నడకలు సృష్టించినవైనం చూద్దాం. అతడు మనకు వినయం, మర్యాద నేర్పిస్తాడు. అతడు మనతో అంటాడు: ప్రపంచం అనంతంగా విశాలమైనది. మనిషి అంతే చిన్నవాడు, మీరేం ఊహించుకుంటారు? మన ఆదర్శాలు కాంతివంతమైన నీడలు, కాని వాటిని ఆచరించి, అనుసరించడంలోనే మన నిజమైన సంతోషం ఉన్నది. మనుష్యుల అసంపూర్తి జ్ఞానం, అసంపూర్ణత చాలా అధికంగా ఉన్నాయని అనటోల్‌ఫ్రాన్స్ భావిస్తాడు. కాని అతడు తనని తాను ఆ అసంపూర్ణ

జ్ఞానమున్న వారి నుంచి వేరు చేసుకోడు. అతడి రచనలలో ఉన్న సున్నితత్వాన్ని తెలుసుకోవడానికి మనం అతడిని తిరిగి చదువుతాం.

అతడి కొన్ని రచనల్లో అధికశాతాన్ని ఆక్రమించిన భౌతికలాలసలనూ సుఖలాలసలే జీవిత ఫలాలనే సిద్ధాంతానికి - శృంగార సిద్ధాంతానికి సంబంధించిన భావనలనూ తెలుసుకోవడానికి తిరిగి చదువుతాం. ఉదాహరణకు అతడు ఫ్లొరెన్స్‌కి చెందిన రెడ్‌లిలీ అనే పేరిట రాసిన వివరణలు - గంభీర మనస్కులకు పనికిరావు. అనటోల్‌ఫ్రాన్స్ అంటాడు - మానసిక సంతోషాలు భౌతిక సంతోషాలు, సుఖాల కన్నా అధికమైనవి. ( అనటోల్‌ఫ్రాన్స్ ఆధ్యాత్మికగురువు చెప్పిన దానికి అనుగుణంగా) భౌతిక సుఖాల తుపానులను తట్టుకోవడానికి వివేకవంతుడైన మనిషి తన జీవిత నావను ఆత్మ యొక్క ప్రశాంతత అనే రేవుకే చేరుస్తాడు. తోటి మానవుల కోసం సానుభూతి కలిగి ఉండేలా మనని మనకెన్నో జీవిత విషయాలను అందనివ్వని కాలం అనుమతించాలని, అప్పుడే వృద్ధాప్యంలో మనం సమాధిలో ఉన్నట్లుండి పోకుండా ఉంటామని అనటోల్‌ఫ్రాన్స్ చెబుతాడు.

అనటోల్‌ఫ్రాన్స్ తనకు తాను విధించుకున్న తన ఏకాంతాన్ని వదిలి, తన జ్ఞాన శిఖరాన్ని వీడి, తన తోటి మనుష్యులతో కలవడానికి సిద్ధపడ్డాడు. వోల్టేర్‌లాగా వ్యక్తుల అణచబడిన, నిరాదరణకు గురైన హక్కుల కోసం, తన గాయపడిన దేశ భక్తి భావన కోసం పోరాడాడు. దేశాల మధ్య తరగతుల మధ్య తిరిగి ఐక్యతలు నెలకొల్పడానికి వర్కింగ్ క్లాస్‌కు వెళ్ళాడు. అతడి వృద్ధాప్యం అతడికి అడ్డంకి కాలేదు. సమాజాల పతనానికీ, ధన ప్రభావం వీటికి వ్యతిరేకంగా, అతడు చేసిన ఆదర్శవాద పోరాటాలకు ఎంతో గౌరవం పొందాడు.

అతడు వ్రాసిన సంచలనాత్మక నవల - ఫ్రాన్స్ దేశపు హీరోయిన్ జోన్ ఆఫ్ ఆర్క్‌కు సంబంధించినది - ఆమెను సెయింట్స్ జాబితాలో చేర్చతగినదిగా అభివర్ణించింది. జోన్ ఆఫ్ ఆర్క్ పై ఉన్న మార్మికత ముసుగును తొలగించింది.

దిగాడ్స్ ఆర్ అథర్స్ట్ (దేవతలు దాహంతో ఉన్నారు) ఒక విప్లవానికి సంబంధించిన గొప్ప నాటకం. మానవుల చిన్న చిన్న గమ్యాలు రక్త పాతంతో కూడిన యుద్ధాల్లో ప్రతిబింబిస్తాయని చెబుతుంది. అనటోల్‌ఫ్రాన్స్ నిజాయితీతో కూడిన ఈ విషయాలన్నీ ఖచ్చితంగా చెప్పాడని మనం అనుకోనవసరం లేదు. మరింత సహనం మరింత మానవత్వం వైపు మానవులు చేసిన ప్రయాణాన్ని అంచనా వేయడానికి ఒక శతాబ్ది చాలా తక్కువ కాలం. సంఘటనలు అనటోల్‌ఫ్రాన్స్ వేసిన ముందస్తు అంచనాలను, భవిష్య దర్శనాన్ని నిజం చేసాయి. ఈ నాటకం ప్రచురితమైన తర్వాత అనేక సంవత్సరాలకు ఒకగొప్ప సంక్షోభం వచ్చింది. సాలమాండర్స్ ( బల్లిలాంటి జీవులు) పోరాటాలకు గొప్ప ( అరీనాలు) - యుద్ధమైదానాలు సృష్టించారు. యుద్ధపు పొగలు భూమినిండా ఆవరించుకునే ఉన్నాయి. ఆ పొగల మధ్య నుండి పొగమంచు నుండి స్పిరిట్స్ ఆవిర్భవించాయి. క్రొత్త ఆవిష్కారాలను ప్రాఫెట్స్ ప్రకటించారు. నాగరికతా శిథిలాలను మూఢనమ్మకాల కెరటం ముంచెత్తింది, అనటోల్‌ఫ్రాన్స్ సున్నితమైన, సునిశితమైన ఆయుధం ధరించి దొంగ సన్యాసులని, స్పిరిట్స్‌నీ పరుగులు తీయించాడు. మనం ఉన్న కాలానికి విశ్వాసం అవసరమే - కాని ఆ నమ్మిక ఆరోగ్యప్రదమైన అనుమానాలను కలిగి ఉన్నదై ఉండాలి. స్పష్టత, ఒక క్రొత్త మానవత, ఒక పునరుజ్జీవనం, ఒక మార్పు కలిగి ఉండాలి.

ఫ్రెంచి నాగరికతకు మిగిలిన ప్రపంచంలాగే స్వీడన్ కూడా చాలా ఋణపడి ఉన్నది. ఫ్రెంచి శాస్త్రీయ వాద ఫలాలను మనం అందుకున్నాం. చారిత్రాత్మకతను కూడా పొందాం. అవి లేకపోతే మనం ఎక్కడ ఉండి ఉండే వాళ్ళం? ఈ ప్రశ్న ఇవాళ మనకి మనం వేసుకోవాలి. మన కాలంలో అనటోల్ ఫ్రాన్స్ ఆ నాగరికతకు సిసలైన అధికారికమైన ప్రతినిధిగా మనం చెప్పుకోవాలి. గొప్ప శాస్త్రీయవాదులలో అనటోల్ ఫ్రాన్స్ ఆఖరివాడు. అతడిని ఆఖరి యూరోపియన్ అనికూడా అంటారు.

నేరపూరితమైన మూర్ఖమైన వాదాలు, ధోరణులు తలెత్తుతున్న రోజులలో - అన్నింటినీ మించి దురహంకారం తలెత్తుతున్న రోజులలో - మానవుల మధ్య స్పష్టమైన మేధోపరమైన ఇచ్చిపుచ్చుకోవడాలను నిరోధించేందుకు ప్రయత్నాలు జరుగుతున్న కాలంలో మానవులు వారంతా ఒకరికొకరు అవసరమని గ్రహించాలని చాటి చెబుతూ అనటోల్‌ఫ్రాన్స్ స్పష్టంగా గొంతెత్తి చెప్పాడు.

హాస్యరస పూరితంగా, తెలివిగా, విశాలదృష్టితో అనటోల్ ఫ్రాన్స్ మానవ నాగరికత అంతర్లీనంగా మూర్ఖ పిడివాదాలతో, ఆటవికతతో చేసిన యుద్ధంలో గెలుపు సాధించాడు. కార్నిల్, రేసిన్ తమ హీరోలను సృష్టించిన ఫ్రాన్స్ ఉత్కృష్టదశకి అనటోల్ ఫ్రాన్స్ నాయకుడుగా ఉన్నాడు.

ఈ రోజు మనం మన జర్మనీ దేశంలో కవుల అత్యున్నత బహుమతైన ప్రపంచ బహుమానాన్ని సత్యానికి నిజాయితీగల సేవకుడు, సౌందర్యానికి సేవకుడు, మానవతకు వారసుడు అయిన ఈ మాస్టర్‌కి ప్రదానం చేస్తున్నాం. రబిలియస్, మాన్‌టెన్, వోల్టేర్, రెనన్‌ల వారసుడు, శిష్యుడు అయిన ఈ రచయిత రెనన్ విగ్రహం వద్ద చెప్పిన మాటల్లో అతని రచనోద్దేశ్యం, విశ్వాసం ధ్వనిస్తాయి. అతడన్నాడు - నిదానంగా, కాని ఖచ్చితంగా మానవాళి వివేకవంతుల జ్ఞానుల స్వప్నాలను నిజం చేస్తుంది.

అనటల్ ఫ్రాన్స్ - మీరు ఉత్కృష్టమైన, శాస్త్రీయమైన ఫ్రెంచ్ భాష అనే వారసత్వాన్ని పొందారు పనిముట్టుగా - మీ భాషా పరిజ్ఞానం స్పష్టత, పరిశుద్ధత కలిగినది. మీ చేతిలో భావ సునిశితత్వం అనే మరో అయుధం ఉన్నది. మీ చేతిలో అది మరింత సౌందర్యాన్ని సంతరించుకున్నది.

చక్కని సాహిత్య శిల్పాలను చెక్కడానికి వాటిని మీరు ఉపయోగించారు. కేవలం మీ కళాత్మకతే మమ్మల్ని విభ్రములని చేయలేదు. మీ అత్యుత్తమ సృజనాత్మకత కూడా మాకు దిగ్భ్రమ కలిగించింది. మీ సానుభూతి పూరితమైన, విశాల హృదయం - ( మీ రచనలు ఋజువు చేసినట్లు) కూడా మమ్మల్ని ఆకట్టుకుంది.

**జీవిత చరిత్ర:**

అనటోల్ ఫ్రాన్స్ అసలు పేరు జాక్వస్ అనటోల్‌థిబాల్ట్(1844-1924). ఇతడు పారిస్‌లోని ఒక బుక్ డీలర్ కుమారుడు. కాలేజ్‌స్టానిస్‌లాస్ అనే బాలురపాఠశాలలో శాస్త్రీయ విద్య అభ్యసించాడు. కొంత కాలం ఎకోల్‌డెస్ ఛార్ట్స్‌లో కూడా విద్యాభ్యాసం చేసాడు. ఇరవై ఏళ్ళు వివిధ ఉద్యోగాలు చేసాడు. కాని అతనికి ఎప్పుడూ తన రచనలు చేసుకోడానికి తగిన సమయం ఉండేది. ప్రత్యేకించి సెనేట్‌లో అసిస్టెంట్‌లైబ్రేరియన్‌గా 1876 -90 మధ్యకాలంలో పని చేసినపుడు. అతడి సాహిత్యసేవ

విస్తృతమైనది. ప్రధానంగా అతడు రచయితగా - నవలా రచయితగా, కథకుడిగానే ప్రసిద్ధుడైనప్పటికీ అతడు స్పృశించని సాహితీ విభాగం లేదు.

ఫ్రెంచి శాస్త్రీయతావాదుల్లో ప్రముఖ రచయితల్లో అనటోల్ ఫ్రాన్స్ కూడా ఒకరు. పద్దెనిమిదో శతాబ్దపు ఫ్రెంచి సంప్రదాయాన్ని కొనసాగిస్తూ వ్యంగ్య ధోరణిలో, వోల్టైర్, ఫెనెలాన్‌ల పద్ధతిలో అతడిశైలి ఉండేది. జీవితం పట్ల అతడికి ఉన్న హెడొనిస్ట్ ధోరణి అతడి రచనలన్నింటిలో ఉన్నప్పటికీ 'ది గార్డెన్ ఆఫ్ ఎపిక్యురస్' (1895)లో అధికంగా కనపడుతుంది. (ఇది ఒక కొటేషన్ల సంకలనం).

ఫ్రాన్స్ ఎన్నో కథలు, నవలలు వ్రాసినప్పటికీ, అతడికి తొలుత ప్రఖ్యాతిని తెచ్చినది ''లేక్రైమ్‌డి సిల్విస్టర్ బొనార్డ్'' (1881) అనే ఫ్రెంచి నవల. ఆ నవల అకాడమీ ఫ్రాంక్రైజ్ నుంచి బహుమతి పొందింది. 1896లో ఫ్రాన్స్ ఆ ఎకాడమీ సభ్యుడైనాడు.

1885లో అతడు ఆత్మకథాత్మకమున తగిన 'మైఫ్రెండ్స్ బుక్' రాసాడు. తర్వాత పియరీ నాజియెర్ (1899); లేపెటిట్ పియరీ (1918); లావే ఆఫ్లర్ (1922) (ది బ్లూమ్ ఆఫ్ లైఫ్) లు రచించాడు. 1888 నుంచి 1892 వరకూ ఫ్రాన్స్ లే టెంప్స్ అనే దిన పత్రికకు సాహితీ విమర్శకుడుగా ఉన్నాడు. రెనాన్ ద్వారా స్ఫూర్తిని పొంది వ్రాసిన అతడి విమర్శలు నాలుగు భాగాలుగా వచ్చాయి. ఆన్ లైఫ్ అండ్ లెటర్స్ అనే పేరుతో. ఇవి 1888 - 92 మధ్య ప్రచురితం.

ఈ సమయంలో అతడి రచనలు చారిత్రక కాల్పనిక గాథలుగా ఉన్నాయి. వాటిలో లోతైన వివేచన, ఆకర్షణ ఉన్నాయి. సమాజం పెగనిజమ్ నుంచి క్రిస్టియానిటీకి మారిన కాలం అతడి అభిమాన కాలాలలో ఒకటిగా అతడి రచనల్లో చేరింది. 1889లో బాల్తాజార్ వచ్చింది. ఇది మేగీ కథల్లో ఒక కథకు ఆకర్షణీయమైన రచన. 1890లో థెయిస్ వచ్చింది. అలెగ్జాండ్రియన్ కోర్టీలో ఒకరు క్రిస్టియన్‌గా మారిన కథ ఇది. 1892లో మదర్ ఆఫ్ పెర్ల్ వచ్చింది. ఇది ఒక సన్యాసికి, ఒక లాటిన్ దేవతకు సంబంధించిన కథ.

1893లో ఫ్రాన్స్ తన ప్రఖ్యాత నవల ఎట్ ది సైన్ ఆఫ్ రెన్ పెడాక్ రచించాడు. ఈ నవల పద్దెనిమిదో శతాబ్దపు ఫ్రాన్స్‌కి సంబంధించిన ఒక కథ. నవలలో ప్రధాన పాత్ర అబీకొయనార్డ్ సంక్లిష్టమైన, వ్యంగ్య పూరితమైన అభిమానించ తగిన పాత్ర. ఈ పాత్ర లేస ఒపినియన్స్ డి జెరోమ్ కోయినార్డ్ (1893) నవలలోనూ, దివెల్ ఆఫ్ సెయింట్ క్లెయిర్ అనే కథల సంకలనంలోనూ తిరిగి కనిపిస్తుంది. ది రెడ్ లిలీ (1894) అనే ప్రేమ కథ ద్వారా ఫ్రాన్స్ సమీకాలీన కథాంశం తీసుకున్నాడు. తర్వాత సంవత్సరాలలో హిస్టరీ కంటెంపొరెయిన్ (1896-1901) వ్రాసాడు. ఇవి పూర్తిగా నవలలు కావు కాని ఫ్రాన్స్ రచనల్లో ఒక ప్రఖ్యాత పాత్ర ప్రొఫెసర్ బెర్గరెట్ ఆధారంగా రచించబడిన నవలలు.

చివరి రోజుల్లో ఫ్రాన్స్ సామాజిక అంశాల్లో ఆసక్తి పెంచుకున్నాడు. అతడు డ్రేఫస్ కేసులో తీర్పుని వ్యతిరేకించాడు. సోషలిజంకు కొంత సానుభూతికరమైన రచనలు చేసాడు. అతడు చివర్లో వ్రాసిన ముఖ్య రచనల్లో జోన్ ఆఫ్ ఆర్క్ - జీవిత కథ (1908); ది గాడ్స్ ఆర్ అథర్స్ట్ (1912); ది రి వోల్ ఆఫ్ ది ఏంజెల్స్ (1914) ప్రముఖమైనవి. 1925 - 1935 మధ్య కాలంలో అనటోల్ ఫ్రాన్స్ కలెక్టెడ్ వర్క్స్ 25 భాగాలుగా ప్రచురితమయ్యాయి.

# స్నేహరశ్మి హైకు సంకలనం :
# "SUNRISE ON SNOWPEAKS"

- గాలి నాసర రెడ్డి

గుజరాతీలో హైకు రచనకు ఆద్యుడు ఝీణాభాయీ దేసాయి 'స్నేహరశ్మి' (1903 - 1991).

1921లో కవితా రచన ప్రారంభించిన స్నేహరశ్మి 1935లో తన మొదటి కవితా సంకలనం 'అర్ఘ్య'ను వెలువరించాడు. కథ, నవల మొదలైన ప్రక్రియల్లోనూ రచనలు చేశాడు. ఆయన ఆత్మకథ మూడు భాగాలుగా వెలువడింది.

స్నేహరశ్మి రాసిన తొమ్మిది హైకులు తొలిసారిగా 'సంస్కృతి' (సంపాదకుడు : ఉమాశంకర్ జోషి) ఆగష్టు 1965 సంచికలో అచ్చయ్యాయి. స్నేహరశ్మి మొదటి హైకు సంకలనం 'సోనేరి చాంద్, రూపేరీ సూరజ్' 1967లో వెలువడింది. ఇందులో 359 హైకులతో పాటు 6 తంకలు కూడా ఉన్నాయి. భారతీయ భాషల్లో వెలువడిన స్వతంత్ర హైకు సంకలనాల్లో ఇదే మొదటిది.

"Sunrise on Snowpeaks' :

1986లో గుజరాతీ సాహిత్య అకాడెమి ప్రచురించిన స్నేహరశ్మి హైకు సంకలనం "Sunrise on Snowpeaks'. ఇందులో 302 హైకులు (రెండు హైకులు పునరావృతం కాగా 304 అయ్యాయి : 112/116, 169/279) ఇంగ్లీషు, హిందీ అనువాదాలతో పాటు సంకలితమయ్యాయి. ఆంగ్లానువాదాలు స్నేహరశ్మివే. హిందీ అనువాదాలు భగవత్ శరణ్ అగర్వాల్ చేశాడు.

ఈ పుస్తకంలోని "Introduction' లో స్నేహరశ్మి తాను హైకులు రాయడానికి దారి తీసిన పరిస్థితుల్నీ, హైకు గురించి తాను తెలుసుకున్న విషయాల్నీ, తన అభిప్రాయాల్నీ స్పష్టం చేశాడు.

5-7-5 అక్షర నియమాన్ని పాటించిన స్నేహరశ్మి ఋతు బోధక పద (కిగో) నియమం గురించి వెలిబుచ్చిన అభిప్రాయం ఇది : In our age of technology the insistence on the use of a season or key-word is questioned, and a number of Haiku are written without it in Japanese. In Gujarati, though certain words indicate a particular season, as for example, cuckoo indicates spring and rainbow monsoon, clearly defined season words are few. We, therefore, do not deem it imperative to include a clearly defined season word in Gujarati Haiku."

---

గాలి నాసర రెడ్డి, తెలుగు లెక్చరర్, ఎం.ఎస్.ఆర్. డిగ్రీ కళాశాల, వింజమూరు, నెల్లూరు జిల్లా.

ఈ సంచికలో నన్ను గాఢంగా ఆకర్షించిన హైకుల్లో మచ్చుకు మూడు (నా అనువాదంలో) :

నదీ జలంలో
ఊగుతున్న చంద్రబింబం ...
తీరాన చితి. (123)

మంచు బిందువు
తామరాకు మీద ...
సూర్యోదయం. (97)

బాబు మేల్కొని
అమ్మను చూసి చిరునవ్వి
మళ్లీ నిద్రపోయాడు. (33)

స్నేహరశ్మి హైకులు కొన్ని నాకు ఇతరుల రచనల్ని గుర్తుకు తెచ్చాయి. వాటిలో కొన్ని చూడండి:

స్నేహరశ్మి హైకు :

Leaking roof...
Child on mother's lap
Soaking in her tears. (136)

శాలవాహనుడి గాథ (గాథా సప్తశతి : 7-21):
రక్ఖేఇ పుత్తఅం మత్థఏణ ఓచ్చోఅఅం పడిచ్ఛంతీ
అంసుహిం పహి అఘరిణీ ఓల్లిజ్జంతం ణలక్ఖే ఇ.

(రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ అనువాదం :
చూఱునుండి వాన నీరు గాఱఁగఁ దల
యడ్డు పెట్టి కొడుకు నాదు కొనెడు
గాని, పాంథ గృహిణి, కన్నీట వానిని
దానె తడుపుచుంట గానదకట.)

స్నేహరశ్మి హైకు :

A flower in the stream,
Submerging, surfacing...
A top a stumbling bee. (186)

అవటంకుడి గాథ (గాథా సప్తశతి : 1-37) :

తాలూరభమా ఉలఖుడి అకేసరో గిరిణ ఈఏంపూరేణ

దరబుడ్డఉ బుడ్డ మహో అరో హీరఇ కలంబో.

(రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ అనువాదం:

కొండ సెలయేటి సుడికిఁ జిక్కుకొని కలఁగి

తిరుగుచును, గేసరంబులు విఱుగఁ, జూడు,

అరమునిఁగి, తేలి, మునుఁగుచు మరలఁ దేఁటి

వెంటఁ బడియుండఁ, గడిమిపూ వెళ్లిఁ గడచు.)

స్నేహరశ్మి హైకు :

Night, a sweet coo,

Waking up I see who

But moon in the window : (7)

ఫుజివర సనెసద (1139-1191) వక :

Gazing where

A hototogisu

Had cried,

only there remained

The moon of early dawn.

(ఆర్. హెచ్. బ్లైత్ అనువాదం)

స్నేహరశ్మి హైకు :

Morning : a pair of doves

playing hide - and - seek

Amidst fallen leaves. (170)

ఇస్స (1763 - 1827) హైకు :

The sparrows

Are playing hide - and - seek

Among the tea - flowers.

(ఆర్. హెచ్. బ్లైత్ అనువాదం)

స్నేహరశ్మి హైకు :

The shower passed away ...
Moon - fragments
On wet grass. (44)

శోవు (1859 - 1943) హైకు :

A shower comes and passes
Leaving the bright summer moon
Upon the grasses.

(కెనెత్ యసుద అనువాదం)

స్నేహరశ్మి హైకు :

A doll's house,
A young, childless woman ...
A tender touch ! (103)

రన్‌సెత్సు (1653 - 1707) హైకు :

The Childless woman,
How tender she is
To the dolls !

(ఆర్. హెచ్. బ్లైత్ అనువాదం)

స్నేహరశ్మి హైకు :

A flower
Falling on the ground
Is held midway by leaves. (125)

శోహ (? - 1771) హైకు :

The camellia flower
was going to fall,
But it caught in its leaves.

(ఆర్. హెచ్. బ్లైత్ అనువాదం)

ఈ పోలికలు స్నేహరశ్మికి తెలీకుండానే వచ్చివుంటాయా, నాకైతే అలా అనిపించడం లేదు.

# అబలలైన సబలలు శర్మిష్ఠ - దేవయాని

- కె. యస్. మంగళగౌరి

మహాభారతం 3వ ఆశ్వాసంలో యయాతి చరిత్ర ఉంది. ఒక విధంగా యయాతి కురు వంశానికి మూల పురుషుడు. కాని అతని చరిత్రను (సామాజిక) మనస్తత్వ విశ్లేషణా దృక్పథంతో పరిశీలిస్తే ఆనాటి యుగలక్షణాలు అవి ఈనాటికీ రూపాంతరంలో ప్రవర్తిల్లుతున్న విధానం స్పష్టమవుతుంది.

కథా సంగ్రహం : రాక్షస రాజ్యానికి రాజు వృషపర్వుడు. అతని కూతురు శర్మిష్ఠ. అదే రాజ్యానికి ఆచార్యుడు శుక్రుడు. అతని కూతురు దేవయాని.

ఒకసారి జలక్రీడలకు వెళ్ళినపుడు గాలి వల్ల దుస్తులన్నీ కలసిపోతాయి, శర్మిష్ఠ హడావిడిలో దేవయాని దుస్తులను ధరిస్తుంది. దేవయాని శర్మిష్ఠను నిందిస్తుంది, శర్మిష్ఠ కూడా బదులుగా తానూ నిందించి ఆమెను ఒక పాడుపడిన నూతిలో పడేసి వెళ్ళి పోతుంది.

సహాయం కోసం అర్థిస్తున్న దేవయాని ఆక్రందన విని ఆవైపుగా వస్తున్న యయాతి తన దక్షిణ కరంతో ఆమెను నూతిలో నుంచి బయటకు తీసి రక్షిస్తాడు.

దేవయాని తాను నగరంలోకి రానని దాసీ చేత కబురు పంపిస్తుంది. శుక్రాచార్యుడు వచ్చి నచ్చచెప్పినా వినదు. తండ్రి ఇంక కూతురి మాట కాదనలేక ఆమె రాకుండా తాను కూడా నగరానికి వెళ్ళనంటాడు.

విషయం తెలిసి వృషపర్వుడు పరుగెత్తుకుంటూ వచ్చి మన్నింపు కోరతాడు. రాక్షసరాజ్యవైభవం అంతా శుక్రాచార్యుడి మీదే ఆధారపడి ఉండటం వల్ల అతడిని (దేవయానిని) ప్రసన్నుడిని చేసుకోవాలని ప్రయత్నిస్తాడు. దేవయాని 'శర్మిష్ఠ వేయి మంది దాసీలతో సహా' తనకు దాసీ అవాలని కోరుకుంటుంది. వృష పర్వుడు ఆ విధంగానే శర్మిష్ఠను దేవయానికి దాసీగా చేస్తాడు.

ఒక రోజు దేవయాని చెలులతో కలసి వనానికి వెళ్ళి అక్కడ యయాతిని చూస్తుంది. యయాతి కూడా వారి సమీపానికి వచ్చి దేవయాని తనకు ముందే తెలిసి ఉండటం వల్ల అతిశయ రూపలావణ్యా సుందరి అయిన శర్మిష్ఠను చూచి, ఆమె కుల గోత్ర నామాదుల గురించి తెలుసు కోవాలను కుంటాడు. దేవయాని ఆమె తన దాసి అని ముక్తసరిగా సమాధానం ఇచ్చి ఖండించేస్తుంది.

దేవయాని అప్పటికే యయాతి తనకు భర్త అనీ, సూర్యుడి సాక్షిగా అతడు తన కుడి చేయి పట్టుకుని బావిలోనుంచి, వెలుపలికి తీసినపుడే పాణిగ్రహణం అయి పోయిందనీ అంటుంది. యయాతి క్షత్రియుడు బ్రాహ్మణ కన్యను చేసుకోవడం శాస్త్ర విరుద్ధం అనీ వారిస్తాడు. దేవయాని తండ్రి అయిన శుక్రుడి చేత చెప్పిస్తే వివాహానికి సమ్మతిస్తానంటాడు. కుమార్తె కోసం శుక్రాచార్యుడు ధర్మాన్నే తిరగరాసి వారి వివాహం శాస్త్ర సమ్మతమే అంటాడు. దాసీ సహితంగా దేవయానిని యయాతికిచ్చి, శర్మిష్ఠ విషయంలో ఒక షరతు పెడతాడు. ఆమెకు ఆభరణాలు వస్త్రాలు లాంటివి ఎన్ని అయినా ఇవ్వచ్చునీ, శయన విషయంలో మాత్రం పరిహరించమనీ హెచ్చరిస్తాడు.

యయాతి దేవయానులు ఆనందమయమైన జీవితాన్ని గడుపుతూ ఉంటారు. వారికి పుత్రులు కూడా కలుగుతారు. అది చూసి శర్మిష్ఠకు తాను కూడా సంతానవతి కావాలనుకుంటుంది. ఆమె యయాతి తనను ప్రీతితోను కరుణతోను చూడటం గమనిస్తుంది. తనకు కూడా అతని మీద అనురాగం ఉంది అనుకొని దేవయాని యయాతిని ఏ తర్కంతో భర్తగా పొందిందో అటువంటి తర్కాన్నే

---

కె.ఎస్.మంగళగౌరీ, ఎ.పి.స్టడీ సర్కిల్‌లో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు. హైదరాబాదు.

ఉపయోగిస్తాను అనుకొంటుంది. యయాతి దగ్గరకు వెళ్ళి 'దేవయాని తన అధికారిణి కాబట్టి దేవయానికి భర్త అయినవాడు తనకు కూడా భర్త అవుతాడు కాబట్టి తనను పరిగ్రహించమని కోరుకుంటుంది.

యయాతి శుక్రుడు తనను శయన విషయంలో శర్మిష్ఠను పరిహరింపమని ఆంక్షపెట్టిన విషయం జ్ఞాపకం చేస్తాడు. శర్మిష్ఠ కొన్ని ప్రత్యేక సందర్భాలలో బొంకినా తప్పు లేదంటూ వాటిలో 'వధూజన సంగమం', 'వివాహం' పేర్కొంటుంది. యయాతి వెంటనే శర్మిష్ఠను పరిగ్రహిస్తాడు.

యయాతి వల్ల శర్మిష్ఠ సంతానవతి అయిందని తెలుసుకున్న దేవయాని, తండ్రి దగ్గరకు వెళ్ళి ఆ విషయం వెల్లడి చేస్తుంది. శుక్రాచార్యుడు యయాతి యౌవన గర్వంతో రాగాంధుడైనందుకు 'జరాభారుడవు అవ' మని శపిస్తాడు. యయాతి తను ఇంకా దేవయాని వల్ల సంపూర్ణ సౌఖ్యాన్ని పొందలేదనీ తనకు యౌవనమిమ్మనీ వేడుకుంటాడు. కూతురి మీద ప్రేమవల్ల శుక్రాచార్యుడు అతి అపురూపమైన జరా మార్పిడి ( ఒకరి ముసలితనాన్ని మరొకరు తీసుకోగలగడం) విద్యను ప్రసాదిస్తాడు.

యయాతి దేవయాని వల్ల కలిగిన పుత్రులను తన ముసలితనాన్ని తీసుకొమ్మని అభ్యర్థిస్తాడు. వారు నిర్ద్వంద్వంగా తిరస్కరిస్తారు. శర్మిష్ఠ కొడుకు 'పూరుడు' తండ్రి ముసలి తనాన్ని గ్రహించడానికి సిద్ధ పడతాడు. తనకు ఆ శరీరం వచ్చింది యయాతి వల్ల కాబట్టి తన మీద తండ్రికి సర్వహక్కులు ఉన్నాయంటాడు. యయాతి సంతోషించి పూరుడి వల్ల యౌవనాన్ని పొంది వెయ్యేళ్ళు శృంగార జీవితాన్ని అనుభవిస్తాడు. తరువాత కొడుకుకి యౌవనాన్ని ఇచ్చేసి అతడినే రాజ్యాభిషిక్తుడ్ని చేస్తాడు. అతడు చక్కగా పాలించి కురు వంశ కర్త అయ్యాడు. యయాతి తపాన్ని ఆచరించి ఊర్ధ్వలోకాలు పొందాడు.

**మనస్తత్వ విశ్లేషణ :** దేవయాని శర్మిష్ఠల కథలను గతానుగతికంగా వినడం కురు వంశానికి యయాతి మూల పురుషుడు అని అనుకోవడమే తప్ప ఆయా పురుష / స్త్రీ పాత్రలలో ప్రతి ఫలించిన మనస్తత్వాన్ని అంచనా వేయడానికి ప్రయత్నిస్తే అతి ఆశ్చర్యకరమైన విషయాలు తెలుస్తాయి. వివిధ వ్యక్తిత్వాలు గోచరిస్తాయి.

'ఆడదంటే మగవాడికి అలుసు' అని 60, 70వ దశాబ్దాల్లో అనుకొని, 80వ దశాబ్దంలో దానికోసం పోరాటం ప్రారంభించినా ప్రాచీన కాలం నుంచీ తెలియని అన్యాయానికి స్త్రీ లోనవుతూనే ఉంది. అందుకు ఈ కథలోని శర్మిష్ఠ చక్కని ఉదాహరణ.

బాల్యంలో రాజ్యవైభవాన్ని కాపాడుకోవడానికి తండ్రి ఆమెను దేవయానికి దాసీగా చేస్తాడు. అంతకు ముందే పంతమాడిన సహచరికి దాసీ అవడం ఎంత నరకమో పడ్డవారికే తెలుస్తుంది.

యౌవనంలో యయాతి ఆమెను మరొక విధంగా బాధించాడు. దేవయానితో పాటు ఉన్న శర్మిష్ఠను 'అతిశయ రూప లావణ్య గుణ సుందరి'గా గుర్తించాడు. అంటే అతని చూపు ఆమె సౌందర్యాన్ని గమనించింది. వెంటనే 'కులగోత్రనామా' లను తెలుసుకోవాలనుకున్నాడు. అవి కావాల్సింది వివాహానికే! అంటే యయాతికి శర్మిష్ఠను వివాహమాడాలనే కోరిక కూడా కలిగి ఉంటుంది. కాని దేవయాని విముఖంగా ఉండటంతో కిమ్మన లేదు. కారణం ... దేవయాని తండ్రి అన్ని విధాలా ఉన్నతుడు కావడమే. బాల్యం నుంచీ మానసికంగా ఒంటరిగా ఉంటూ, యౌవనంలో అడుగిడిన శర్మిష్ఠకు యయాతి ఇచ్చిన బహుమతి ఇది.

శర్మిష్ఠ మీద యయాతి వాంఛను శుక్రుడు కూడా కనిపెట్టాడు. అందుకనే శర్మిష్ఠ ఒక్క దాని విషయంలో 'శయన విషయంలో పరిహరించమని ఆంక్ష విధించాడు. అంటే దేవయానిని వివాహం చేసుకున్న సందర్భంలో కూడా యయాతికి శర్మిష్ఠ మీద మోహం ఉందనీ అతడు దానిని దాచుకునే ప్రయత్నం చేయలేదనీ అర్థమవుతుంది. యయాతి ప్రవర్తన శర్మిష్ఠ జీవితంలో చింతకు, మార్పుకు కారణమైంది.

శర్మిష్ఠ దాసీగా ఉంది కాబట్టి ఆమె భౌతిక అవసరాలు చూసేవారు లేరు. యౌవనంలో ఉన్నప్పుడు శారీరక (లైంగిక పరమైన కోరిక) ఆనందాన్ని కోరతారు. మనో వైజ్ఞానికవేత్త 'హరిస్టాసలైవన్' ''తొలి యౌవనంలో వ్యక్తి తన వంటరి తనాన్ని సందిగ్ధతను నివారించుకోవడానికి తన వయసు గల వ్యక్తితో గాఢమైన స్నేహాన్ని రూపొందించుకుంటాడు'' అంటాడు. శర్మిష్ఠ యయాతితో స్నేహాన్ని పెంపొందించుకో లేక పోయినా, మానసిక సాన్నిహిత్యాన్ని పెంపొందిచుకొందని చెప్పవచ్చు. ''యయాతి తనను కరుణతో ప్రీతి కలిగేట్లు చూస్తూ ఉంటాడు అనుకోవడంతో తన సౌందర్యాన్ని తపనతో చూసే యయాతితో 'చూపుల సాన్నిహిత్యాన్ని' గాఢంగా ఏర్పరచుకుందని చెప్పవచ్చు. యౌవన మలిదశలో శారీరక ఆనందాన్ని గురించి (లైంగిక ప్రవృతి క్రియ) తనదే అయిన ప్రౌఢమైన తీరు తెన్నుల్ని ఏర్పరచుకుంటారు. ఇది మానవ స్వభావంలో అతి సహజమైన అంశం.

శర్మిష్ఠ చేసింది అదే. తాను కూడా దేవయాని మార్గాన్నే అనుసరించాలనుకుంటుంది. (దేవయాని మీద మొదటి నుంచీ శర్మిష్ఠకున్న పంతం కూడా ఆమె గడుసుదనానికి కారణం అయి ఉండవచ్చు.)

శర్మిష్ఠ యయాతి సంగమం విషయంలో గమనించాల్సిన అతి ముఖ్యమైన విషయం యయాతి అవకాశవాదం. శర్మిష్ఠను చూసిన క్షణం నుంచీ అతడు ఆమెను మోహిస్తూనే ఉన్నాడనడానికి ఆధారాలున్నాయి. అయితే అతడు దాంపత్యానందానికి దూరం కాలేదు కాబట్టి, ధర్మ భంగ భీతీ, శుక్రుడి కిచ్చిన మాట, అది దాటడానికి భీతి - వీటన్నింటి వల్లా హద్దులో ఉన్నాడనీ, సమయం కోసం వేచి ఉన్నాడనీ అనిపిస్తుంది. దేవయానిని పెళ్ళి చేసుకోవాడనికి శుక్రుడే వచ్చి ధర్మం చెప్పాలన్నవాడు శర్మిష్ఠ విషయంలో ఆమె చెప్పిన లోక నీతి విని వెంటనే ఒప్పుకుంటాడు. తమ వివాహం ధర్మ బద్ధం అని యయాతి మనస్ఫూర్తిగా నమ్మి ఉంటే దేవయానికి నిజం చెప్పి ఉండేవాడు. శుక్రాచార్యుడు ప్రశ్నించినపుడు కూడా ధర్మ బద్ధతను నిరూపించుకునేవాడు. తప్పంతా శర్మిష్ఠ మీద నెట్టేసి అబల అర్థించింది కాబట్టి తాను శర్మిష్ఠయందు పుత్రులను కన్నానంటాడు.

యయాతి అవకాశవాది అని కూడా స్ఫురిస్తుంది. శుక్రుడు ఇచ్చిన శాపం నుంచి తప్పించు కోవడానికి తనకి దేవయాని మీద భోగేచ్ఛ తీర లేదంటాడు. కుమార్తెను అధికంగా ప్రేమించే శుక్రుడు ఆమె కోసమైనా తనను అనుగ్రహిస్తాడని యయాతి ఆశ. అదే జరిగింది.

తన వృద్ధాప్యాన్ని మార్పిడి చేసుకోవడానికి పుత్రులను అడగడం ఆలోచించాల్సిన విషయం. పుత్రుల శరీరం తాను పొందితే, పుత్రులు తన భార్యలతో క్రీడించినట్లు అవుతుంది అని కూడా ఆలోచించడు. మొదటి నుంచి పరిశీలించిచూస్తే యయాతి తీవ్ర కాముకుడైన అపసవ్య మనస్తత్వం కలిగినవాడిగా కనిపిస్తాడు. దేవయానిని బావిలోనుంచి బయటికి తీసిన తరువాత ఆమె చేతి స్పర్శ తగిలింది కాబట్టి రెండోసారి ఆమె శర్మిష్ఠ మొ॥ వాళ్ళతో కలసి కనిపించినపుడు శర్మిష్ఠ వైపే చూస్తాడు. దేవయానిని పెళ్లి చేసుకున్న తరువాత శుక్రాచార్యుడి హెచ్చరికను లెక్క చేయకుండా శర్మిష్ఠవైపు కోరికతో చూస్తూనే ఉంటాడు.

పూరుడు యయాతి ముసలి తనాన్ని తీసుకోవడానికి అంగీకరించడంలో 'ఈడిపస్ కాంప్లెక్స్' ఛాయలు కనిపిస్తాయి. 'వ్యక్తి మనసులో అజ్ఞాత మనసు అనేపొర ఉంటుందని సంకుచితమైన కార్యాకారణ ప్రణాళికలో సమన్వయం కాని మానవ మనో వికారాలకు అది జన్మస్థానమని ఫ్రాయిడ్ స్పష్టం చేసాడు. ఈ అజ్ఞాత మనస్సులో మగపిల్లలకు తల్లిని గురించి సాధారణంగా ఉండే అనురాగ భావం తీవ్రంగా ఉంటే 'ఈడిపస్ కాంప్లెక్స్' అనబడుతుంది.

ఈడిపస్ కాంప్లెక్స్‌లో మగపిల్లవాడికి తల్లి పట్ల లైంగికేచ్ఛ, తండ్రి పట్ల విముఖత ఉంటాయి. కాల క్రమంలో సామాజిక నియమాలను అనుసరించి శిశువు ఈ రెండు లక్షణాలను దమనం చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. తండ్రితో తాదాత్మ్యకరణం వల్ల ఇది సులభసాధ్యమవుతుంది. దీని వల్ల అతనికి తల్లి పట్ల గల లైంగికేచ్ఛ నెరవేరిన తృప్తి కలుగుతుంది. అతని అపారమైన లైంగికేచ్ఛ తల్లి పట్ల సరళమైన అనురాగంగా మార్పు చెందుతుంది. తండ్రి పట్ల ఆరాధనాభావం పెంపొందుతుంది. ఈ విధంగా ఈడిపస్ కాంప్లెక్స్‌ను దమనం చేయడం వల్ల అధ్యహం (super ego) ఏర్పడటం పూర్తవుతుంది. ఇది ఏర్పడటానకి ముందే శిశువు శక్తిని మించిన విపరీతానుభవాలు ఏవైనా ఎదురైతే వాటి ప్రభావాలు అవాంఛనీయంగా ఉండి తరువాత ఏర్పడే మూర్తిమత్వ మౌలిక లక్షణాన్ని నిర్ణయిస్తాయి.

పూరుడు 'ఈడిపస్ కాంప్లెక్స్'ను దమనం చేసుకోవాడానికి తల్లి దాసీ స్థితి, తండ్రి స్వార్థ పరత్వం ప్రతిబంధకాలయ్యాయి. యయాతికి శర్మిష్టమీద కోరిక కలిగినా బాహాటంగా దానిని ప్రకటించలేని పిరికివాడు. అంతే కాదు శర్మిష్ట తనంత తాను వచ్చి కోరిక తీర్చమని అడిగినా సంకోచించిన వాడు.

యయాతి బహుశా రాత్రి సద్దు మణగిన వేళ వచ్చి పబ్బంగడుపుకొని వెళ్లి ఉంటాడే తప్ప శర్మిష్టను గాని, పిల్లలను గాని అందరి ముందూ ఆదరించి ఉండడు. పూరుడికి తండ్రితో సాన్నిహిత్యం ఏర్పడే అవకాశమే లేదు. అందువల్ల అతడిలో ఈడిపస్ కాంప్లెక్స్ దమితం అయ్యే అవకాశం లేదు. అందువల్లనే తండ్రి 'తనకు ఇంకా శృంగార వాంఛ తీరలేదనీ' శారీరక భోగాలను అనుభవించడానికి యౌవనాన్ని ఇమ్మని అడిగిన వెంటనే తన 'భౌతిక శరీరాన్ని' తండ్రికి ఇచ్చేశాడు. యయాతి దేవయానితో బాటు శర్మిష్టతో కూడా భోగాలను అనుభవించి ఉండచ్చు.

ఈ అంశాన్నే స్త్రీ పురుష సంబంధాల దృష్ట్యా పరిశీలించి చూస్తే, ఆనాటి స్త్రీ స్థితి ఎంత 'అధీన' స్థితిలో ఉందో అర్థమవుతుంది.

యయాతి పూరుడి యౌవనాన్ని అడిగినపుడు పూరుడు తనకా శరీరం వచ్చింది తండ్రి వల్ల కాబట్టి తన శరీరం మీద అతనికి సర్వ హక్కులున్నా యంటాడు. అతడిని కనిపెంచిన శర్మిష్ట ప్రస్తావనే ఉండదు. ఆనాడు కన్నవాడు కట్టుకున్నవాడు కూడా స్త్రీని ఎంతగా నిర్లక్ష్యం చేశారో తెలుస్తోంది. ఈ విధంగా చేయడం వల్ల యయాతి, పూరుడు ఇద్దరూ మంచి ఫలితాలు పొందారు.

మరి శర్మిష్ట? ఏమో యయాతిని పుత్రార్థమై అర్థించిన తరువాత కథలో ఇంచుమించు శర్మిష్ట ప్రస్తావనే లేదు. అంటే యయాతి దేవయానితో భోగాలను అనుభవించడానికి అనువైన యౌవనాన్ని ఇవ్వడానికి పుత్రుడిని కనడానికే (పూరుడిని) ఆమె పాత్ర సృష్టింప బడిందా? అన్నివిధాల అపురూపమైన ఆనందాన్ని అనుభవించిన భర్త (యయాతి) ఆపత్కాలంలో నెపమంతా శర్మిష్టమీద వేసి తాను అమాయకుడినని అతి వినయం ప్రకటిస్తాడు.

స్త్రీలను అందినంత కాలం స్వార్థానికి వినియోగించుకొని అనవసరమైనపుడు తప్పుకునే పురుష ప్రవృత్తి యయాతిలో కనిపిస్తుంది.

ఆ యుగంలో (ఈ యుగంలో కూడా) పురుషాధిపత్యమే చెల్లుతోంది. బాల్యం నుంచీ స్త్రీ జీవితాన్ని తండ్రి, భర్త, పిల్లలే నిర్ణయిస్తారు. అందుకు శర్మిష్ట చక్కని ఉదాహరణ.

బాల్యంలో తండ్రి (వృషపర్వుడు) తన రాజ్యవైభవాన్ని కాపాడు కోవడానికి కూతురుని దాసీని చేశాడు. యౌవనంలో బహిరంగంగా తన వాంఛ ప్రేమను ప్రకటించుకోలేని యయాతి శృంగారపు చూపులు ప్రసరింప చేస్తూ, ఆమెలో సహజ సిద్ధమైన వాంఛలు చెలరేగడానికి కారకుడయ్యాడు. కొడుకు పూరుడు తండ్రిమాటను పాటించి భవిష్యత్ కాలంలో చక్రవర్తి వంశకర్త అయ్యాడు. పితృ వాక్పరిపాలకుడుగా యశశ్శు పొందాలనే అహం పూరుడిని తల్లి గురించి ఆలోచించనీయలేదు. ఉంటే తన తల్లిని దాసీని చేసి బాధలు పెట్టిన దేవయాని సౌఖ్యానికి ఉపయోగపడే యౌవనాన్ని తండ్రికి ఇచ్చేవాడు కాదు.

పురుషుడి ఆధిపత్యాన్ని సహజ సిద్ధమైనదిగా భావిస్తూ కూతురిగా, భార్యగా, తల్లిగా వారికి అనుగుణమైన విధంగా నడుచుకొని మనసు, బ్రతుకుల మాట ఎలా ఉన్నా పతివ్రతగా ముద్రవేసుకున్న పాత్ర శర్మిష్ట.

ఈనాటి విలువల ప్రకారం పరిశీలించి చూస్తే పురుషాధిపత్య మధ్య తరగతి జీవన చట్రంలో మగవారి పెత్తందారీతనం వల్ల తనకంటూ ఒక జీవితం లేని స్త్రీలకు ప్రతినిధి శర్మిష్ట. వారి జీవితాన్ని పురుషాధిపత్య సమాజమే నిర్దేశిస్తుంది. వారికి వైయక్తికమైన ఆశలు, ఆలోచనలు, ఆశయాలు ఉండవు. ఉండకూడదు.

సూక్ష్మంగా పరిశీలించిచూస్తే దేవయాని కూడా పురుషాధిపత్య సమాజ భావజాలంవల్ల బాధపడిందే. ఆమెకు తండ్రి ప్రేమకు లోటు లేదు. కూతురు అడిగిన ప్రతి కోరికా అతను నెరవేర్చాడు. ఆమె కోరిన వాడిని పొందడం కోసం ధర్మాన్నే తిరగరాశాడు. అయితే ఆమెను తనకు అధీనగానే భావించాడు. స్వయం నిర్ణయాలు తీసుకోలేక ప్రతిదానికీ (చివరకి భర్తకు మరో స్త్రీతో సంబంధ ముందనే విషయంలో కూడా) తండ్రే ఆమెకు శరణ్యం. సకల విద్యాకోవిదుడు, ధర్మశాస్త్ర విదుడు అయిన శుక్రుడు కూడా కూతురికి వాటిని నేర్పడానికి బదులు, జీవితం సజావుగా సాగించే సుద్దులు చెప్పడానికి బదులు ఆమెను అధీను రాలిగానే ఉంచుతాడు. ఆమె జీవితపు ముఖ్యాంశాలు తానే నిర్ణయిస్తుంటాడు. (అధికారం నెరపే తండ్రి, అధీనురాలైన కూతురు) కూతుళ్ళపై తండ్రిపెత్తనం వీరి అనుబంధంలో కనిపిస్తుంది.

మొత్తం మీద దేవయాని కథలో నాయకుడైన యయాతి అమాయకురాలైన దేవయానిని, అధీనురాలైన శర్మిష్టను చాల తెలివిగా స్వాధీనం చేసుకుని స్వర్గ సౌఖ్యాలను అనుభవించాడు. పూరుడిలాంటి పుత్రుడి వల్ల స్వర్గాధిపత్యమే పొందాడు. యయాతి పాండవ వంశానికి మూల పురుషుడుగా పూరుడు వంశకర్తగా చరిత్రలో నిలిచి పోయారు.

అందుకు మూల కారకులైన శర్మిష్ట దేవయాని చరిత్రగతిలో కలిసి పోయారు.

*(డా॥ జి. ప్రసాదరావు, M.D., (న్యూరో సైకియాట్రిస్ట్) గారి సహకారంతో)*

# నోబెల్ బహుమతి గ్రహీత సుబ్రహ్మణ్య చంద్రశేఖర్

- సి.వి. సర్వేశ్వర శర్మ

సుబ్రహ్మణ్య చంద్రశేఖర్‌కు 1983లో నోబెల్ బహుమతి వచ్చింది. అప్పటికి ఆయన వయసు 73 సంవత్సరాలు. 1910 అక్టోబరు 19న లాహోర్‌లో జన్మించిన చంద్రశేఖర్ యిరవై నాలుగు, యిరవై అయిదేళ్ల వయసులో నక్షత్రాలపై జరిపిన పరిశోధనకే యాభయి ఏళ్ళ తరువాత నోబెల్ బహుమతి లభించింది.

భారతదేశానికి స్వాతంత్రం వచ్చిన తరువాత లాహోర్ పాకిస్తాన్‌లో భాగమయ్యింది. చంద్రశేఖర్ తాతగారు చంద్రశేఖర్ అయ్యర్ విశాఖపట్టణంలోని మిసెస్. ఎ.వి.యన్. కళాశాలలో ప్రొఫెసర్‌గా పని చేశారు.

తాతగారు మద్రాసులో ఉన్న కారణంగా మనుమడు చంద్రశేఖర్ మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో చదువుకున్నాడు. చిత్రం ఏమిటంటే చంద్రశేఖర్ పిన తండ్రి నోబెల్ బహుమతి గ్రహీత సి.వి. రామన్ కూడా అదే కళాశాలలో రెండు దశాబ్దాల ముందు చదువుకున్నాడు.

కళాశాల చదువు పూర్తి అయిన చంద్రశేఖర్ 1930లో కేంబ్రిడ్జి వెళ్ళి అచట రాల్ఫ్ హెచ్. ఫౌలర్ వద్ద పరిశోధన చేసి పిహెచ్.డి. పట్టా పొందాడు. ఈ గురు శిష్యులిద్దరూ 1983లో ఫిజిక్సులో నోబెల్ బహుమతిని సంయుక్తంగా గెలుచుకున్నారు.

**సందిగ్ధ ద్రవ్యరాశి:**

నక్షత్ర నిర్మాణానికి సంబంధించిన చంద్రశేఖర్ పరిశోధనలో శ్వేత కుబ్జతార అంటే వైట్ డ్వార్ఫుకు ఉండే సందిగ్ధ ద్రవ్యరాశి లేదా ద్రవ్యరాశి హద్దు గురించి తెలియజెప్పాడు.

శ్వేత కుబ్జతార అంటే మన భూమి పరిమాణంలో ఉండే నక్షత్రం. కాకపోతే దాని భారం సూర్యుని భారం కన్నా 1.4 రెట్లు అధికంగా ఉంటుంది. క్వాంటమ్ స్టాటిస్టిక్స్ మరియు ప్రత్యేక సాపేక్షతా సిద్ధాంతాల భావనలను అత్యంత ప్రతిభావంతంగా ఈ నక్షత్రాల ఆవిర్భావ ప్రక్రియలో చొప్పించిన మేధావి చంద్రశేఖర్.

ఒక వాయు మేఘం దగ్గరకు నొక్కబడి నక్షత్రంగా రూపం పోసుకునే సమయంలో దాని అంతర్భాగంలో ఉష్ణోగ్రత చాలా హెచ్చుగా పెరుగుతుంది. ఎంత హెచ్చుగా పెరుగుతుందంటే ఒక న్యూక్లియర్ చర్య ప్రారంభం అయ్యేందుకు అవసరమైన ఉష్ణోగ్రతకు పెరుగుతుంది.

**హైడ్రోజన్ పరమాణువులు:**

పదార్థం నిర్మితం కావాలంటే హైడ్రోజన్ పరమాణువులతో మొదలవుతుంది ప్రక్రియ. సౌర నక్షత్రాలలో హైడ్రోజన్ పరమాణువులు హీలియం పరమాణువులుగా మార్పు చెందుతాయి. ఆ తరువాత హీలియం కార్బన్ మరియు ఆక్సిజన్ పరమాణువులుగా భారయుత నక్షత్రాలలో మార్పు చెందుతాయి.

కొన్ని ప్రత్యేక నక్షత్రాలలో ఈ కార్బన్, ఆక్సిజన్ పరమాణువులు మరింత సంక్లిష్ట పరమాణువులుగా మార్పు చెందుతాయి. అంటే నక్షత్రాలు ఉద్భవించడానికి రసాయన మూలకాలు తయారు కావడానికి చాలా దగ్గర సంబంధం ఉంటుంది.

---

సి.వి. సర్వేశ్వర శర్మ, ప్రెసిడెంట్, కోనసీమ సైన్సు పరిషత్, అమలాపురం.

న్యూక్లియర్ చర్యలు హైడ్రోజన్‌తో ప్రారంభమై చివరకు లోహమూలకంగా తయారవ్వడం అనేది చాలా భారవంతమైన నక్షత్రాలలో జరుగుతూ ఉంటుంది.

**చెయిన్ రియాక్షన్:**

సూర్యుని ద్రవ్యరాశి కన్నా రెట్టింపు నుండి నాల్గు రెట్లు భారవంతమైన నక్షత్రాలలో హైడ్రోజన్ హీలియంగా మార్పు చెందిన అనంతరం మిగిలిన న్యూక్లియర్ బూడిద నుండి కొత్త చెయిన్ రియాక్షన్ అంటే గొలుసు చర్య మొదలవుతుంది.

నక్షత్రంలోని హీలియం పూర్తిగా అయిపోవడంతో నక్షత్రం కార్బన్- ఆక్సిజన్ కోర్‌ను అభివృద్ధి పరుస్తుంది. దీని చుట్టూ హైడ్రోజన్ - హీలియం దహన కర్పరాలు ఉంటాయి.

ఈ కర్పరాలు నక్షత్రం తలం వైపుకు దహనం అయి వస్తూంటే నక్షత్రం కాంతి తీవ్రత బాగా పెరుగుతుంది. ఈ కాంతి తీవ్రత ఎంత పెరుగుతుందంటే నక్షత్రం వెలుపలి ఆవరణను దూరంగా గెంటేస్తుంది. ఈ ఆవరణ ఒక రింగు వంటి నెబ్యులాలాగ ఏర్పడుతుంది నక్షత్రం చుట్టూ. నక్షత్రంలో మిగిలిన భాగం వైట్ డ్వార్ఫ్‌గా తయారవుతుంది. అంటే శ్వేతకుబ్జ తారగా దర్శనమిస్తుంది.

**వైట్ డ్వార్ఫ్:**

ఈ వైట్ డ్వార్ఫ్ నిర్మాణం ఎలక్ట్రాన్‌లచే తీవ్రంగా ప్రభావితం కాబడుతుంది. ఈ ఎలక్ట్రానులు కారణంగా నక్షత్రం సాంద్రత విపరీతంగా పెరిగిపోతుంది. ( నీటి సాంద్రత కన్నా మిలియన్ రెట్లు ఎక్కువగా ఉంటుంది). ఈ రకంగా నక్షత్రం మృతస్థాయికి రావడానికి హేలీ విసర్జన నియమం పాటించే ఎలక్ట్రాన్.

నక్షత్రాల సాంద్రత అంత ఎక్కువగా పెరిగే సరికి అందలి అంతర్భాగంలోని అంతర్ కణాల మధ్య దూరం ఎలక్ట్రాన్ పరిమాణం స్థాయికి వస్తాయి. ఎలక్ట్రాన్ వాయువు సాపేక్షతా స్థితికి వస్తుంది. నశిస్తున్న ఎలక్ట్రాన్ వాయు పీడనం సాంద్రత యొక్క 4/3 ఘాతానికి అనుసరించి మారుతూ ఉంటుంది. సాపేక్షతా స్థితికి రాక పూర్వం అంటే తక్కువ సాంద్రత ఉన్నప్పుడు పీడనంలో మార్పులు సాంద్రత యొక్క 5/3 ఘాతానికి అనుసరించి మారుతూ ఉంటుంది. ఈ విధమైన మార్పు ద్రవ్యరాశి - సాంద్రతల మధ్య ఉండే సంబంధాన్ని బాగా ప్రభావితం చేస్తుంది. దీనివల్ల వైట్ డ్వార్ఫ్‌కు లిమిటింగ్ మాస్ అంటే ద్రవ్యరాశి హద్దు నెలకొంటుంది.

ఈ హద్దు, గురుత్వాకర్షణ స్థిరాంకము, ప్లాంక్ స్థిరాంకము, కాంతి వేగము, న్యూక్లియస్ల ద్రవ్యరాశి వంటి స్థిరాంకాల సంయోగంపై ఆధారపడి ఉంటుంది. ఈ హద్దును దాటి వైట్ డ్వార్ఫ్ ద్రవ్యరాశి వెళ్లిందంటే గురుత్వాకర్షణ బలాలకు వ్యతిరేకంగా అది నిశ్చలతలో ఉండలేదు.

సౌర ద్రవ్యరాశి కన్నా నాల్గు నుండి పదహారు రెట్లు భారంగా ఉండే నక్షత్రాలు చాలా ఉగ్రంగా ఉంటాయి. ముఖ్యంగా వాటిలో థర్మో న్యూక్లియర్ చర్యలు ముగిసే సమయంలో.

**న్యూట్రాన్ నక్షత్రం:**

ఇటువంటి నక్షత్రాల చుట్టూ ఏర్పడే రింగ్‌లాంటి, ఆవరణ దూరంగా విసరివేయబడుతుంది.

నక్షత్రం చివరకు న్యూట్రాన్ నక్షత్రంగా తయారవుతుంది. దీనిపరిమాణం పది కిలోమీటర్లుగా ఉండి సౌర ద్రవ్య రాశిని కల్గి ఉంటుంది.

1932లో న్యూట్రాను ఉనికిని గుర్తించిన వెంటనే రష్యన్ శాస్త్రవేత్త లాండూ న్యూట్రాన్ నక్షత్రాన్ని ప్రతిపాదించాడు. నశిస్తున్న ఎలక్ట్రాన్ల వల్ల ఏర్పడే పీడనంతో వైట్‌డ్వార్ఫ్ ఏవిధంగా నిలదొక్కుకుని ఉంటుందో అదేవిధంగా న్యూట్రానులు సమకూర్చే పీడనంతో న్యూట్రాను నక్షత్రం నిలదొక్కుకుని ఉంటుంది.

వైట్ డ్వార్ఫ్ ఒక ద్రవ్యరాశి హద్దు, దీనినే చంద్రశేఖర్ లిమిట్ అని కూడా అంటారు, దాటితే ఏ విధంగా నిశ్చలత స్థితిలో ఉండదో, న్యూట్రాన్ నక్షత్రానికి కూడా ఒక గరిష్ట ద్రవ్యరాశి హద్దు ఉంది. ఈ హద్దు చంద్ర శేఖర్ లిమిట్‌కి పెద్ద భిన్నంగా ఉండదు.

**బ్లాక్‌హోల్:**

నక్షత్రాల తొలి ద్రవ్యరాశి 16 సౌర ద్రవ్యరాశుల కన్నా హెచ్చుగా ఉంటే ఆ నక్షత్రాలు న్యూట్రాను నక్షత్రాలుగా మారినపుడు అవి ద్రవ్యరాశి హద్దును దాటి ఉంటాయి. నక్షత్రం లోపల ఉండే బలాలు ఎంత బలంగా ఉంటాయంటే నక్షత్రం నాశనాన్ని ఏ విధంగా ఆపలేని స్థితి ఉంటుంది. చివరకు ఈ నక్షత్రం 'బ్లాక్ హోల్' అంటే 'కృష్ణబిలం'గా తయారవుతుంది.

ఇటువంటి విన్యాసాలు నక్షత్రాలలో జరుగుతాయంటే చంద్రశేఖర్ సమకాలికుడయిన ఆర్థర్ ఎడింగ్‌టన్ నమ్మలేక పోయాడు.

అయితే ఇప్పుడు ఈ బ్లాక్ హోల్సు గురించి ఆమోదించడమే కాదు వీటిపై అధ్యయనాలు కూడా ఇటీవల అధికమయ్యాయి. చంద్రశేఖర్ కృషి చేసిన నక్షత్రాల నిర్మాణ క్రమం, వికిరణ బదిలీలు, నక్షత్ర గతి శాస్త్రం, ద్రవగతి నిశ్చలత శాస్త్రం, అయస్కాంత ద్రవగతి శాస్త్రం, ప్లాస్మా ఫిజిక్సు, సాపేక్షతా ఖగోళ భౌతికశాస్త్రం, భ్రమణం చెందే కృష్ణబిలాలు రంగాలు శాస్త్ర విజ్ఞాన చరిత్రలో మైలురాళ్ళుగా ఉండిపోయాయి.

**నోబెల్ బహుమతి:**

సి.వి. రామన్‌కు 'రామన్ ఎఫెక్టు' కనుగొన్నందుకు 1930లో నోబెల్ బహుమతి లభించింది. రామన్ అన్నకొడుకు సుబ్రహ్మణ్యచంద్ర శేఖర్. ఇతనికి 1983లో నోబెల్ బహుమతి లభించింది. చెప్పుకోతగ్గ గర్వించతగ్గ విషయం ఏమిటంటే ఒకే కుటుంబంలోని యిద్దరికి నోబెల్ బహుమతి రావడం.

చంద్రశేఖర్ ప్రాథమిక విద్య కోసం పాఠశాలకు వెళ్ళలేదు. సూటిగా అతని చదువు పాఠశాలలో ఆరవ తరగతిలో జేరడంతో మొదలయింది. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఫిజిక్సు అభ్యసించిన చంద్రశేఖర్ గణిత శాస్త్రం ఎంతటి ప్రాముఖ్యత కలిగి ఉంటుందో గ్రహించి సిలబస్‌తో సంబంధం లేకుండా గణిత శాస్త్రం కూడా ప్రొఫెసర్ల సహాయంతో అధ్యయనం చేశాడు.

విద్యార్థిగా ఉండగా చంద్రశేఖర్ 'పట్టికావర్ణ పటం' పై ఒక వ్యాసం రాశాడు. దానిని ఈ నాటికి

ఆ కళాశాలలో భద్రపరచారు. రామన్ విదేశాలు సందర్శించి మద్రాసులోని చంద్రశేకర్ ఇంటికి వచ్చాడు. అప్పటికి చంద్రశేఖర్ వయసు 12 సంవత్సరాలు.

**రామన్ ఫలితం:**

ఇంగ్లాండు ప్రయాణం రామన్ ఓడమీద చేశాడు. ఈ ప్రయాణంలోనే సముద్రం నీలంగా ఎందుకు ఉంది అనే అనుమానం కలగడం ఆ పైన 'కాంతి పరిక్షేపణం' పై తన దృష్టి సారించడం జరిగింది. దీని పర్యవసానమే 'రామన్ ఫలితం' కనుగొనడం అయ్యింది.

రామన్ తన అనుభవాలు చెపుతూంటే అందరూ వింటున్నారు. ఇంగ్లాండులో అందరూ టోపీలు పెట్టుకుని తిరుగుతారు కదా మరి మీరు తలపాగాతో తిరిగితే మిమ్మల్ని ఆశ్చర్యంగా ఇతరులు చూడలేదా? అని అడిగాడు ఒక యువకుడు.

ఈ సంఘటన చంద్రశేఖర్ ఆయనను కలసిన ఒక మిత్రుడికి చెప్పారుట. దానికి రామన్ ఆ యువకునికేసి చూసి తాను లండన్‌లో వున్నప్పుడు జరిగిన అనుభవం చెప్పాడు. రామన్ ఇలా చెప్పారుట:

'లండన్‌లోని రాయల్ ఇన్‌స్టిట్యూట్‌లో లార్డు రూథర్‌ఫర్డ్ ఉపన్యాసం ఇస్తూంటే వినడానికి వెళ్లాను. అయితే నేను వెళ్లేసరికి ఉపన్యాసం మొదలయింది. అందుచేత వెనుక బెంచిలో కూర్చుని ఉపన్యాసం వింటున్నాను. నన్ను చూసిన రూథర్ ఫర్డ్ 'అదేమిటి ప్రొఫెసర్ రామన్ వెనుక బెంచీలో కూర్చున్నారు. ముందుకు రండి' అనిపిలిచాడు.

ఉపన్యాసం అయిన తరువాత రూథర్‌ఫర్డ్‌ను అడిగాను 'నన్ను మీరు ఎలా గుర్తు పట్టారు. ఇంగ్లాండు రావడం నాకు ఇదే మొదటి సారి' దానికి రూథర్‌ఫర్డ్ సమాధానంగా 'నేను మీరు రాసిన పరిశోధనా పత్రాలు చదివాను. ఇప్పుడు ఉపన్యాసానికి వచ్చిన వారిలో మదరాసీ తలపాగా వున్న మిమ్మల్ని చూడగానే మీరే రామన్ అయి ఉంటారని' అనుకున్నాను.

'యువకుడికేసి చూసి తలపాగా నాకెంతటి గుర్తింపు తెచ్చిందో చూశావా' అని రామన్ అన్నాడని చంద్రశేఖర్ తన చిన్ననాటి అనుభవాలను నెమరు వేసుకుంటూ చెప్పాడుట.

చంద్రశేఖర్ కేవలం శాస్త్రవేత్త మాత్రమే కాదు. అతనిలో కళా హృదయం ఉంది. అతను రాసిన గ్రంథాలు చాలా ప్రయోజనకరమైనవి అయ్యాయి.

చంద్రశేఖర్ 1936లో లలితను వివాహం చేసుకున్నాడు. వీరిద్దరికి కాలేజీలో పరిచయం అయ్యింది. అమెరికాలో స్థిరపడ్డా అప్పుడప్పుడు ఇండియా వస్తూ ఉండేవారు. 1968లో చంద్రశేఖర్ ఢిల్లీ వచ్చి జవహర్‌లాల్ నెహ్రూ మెమోరియల్ లెక్చర్ ఇచ్చాడు.

ఆ సమయంలో ఇందిరాగాంధి స్వాగతోపన్యాసం చెబుతూ వైద్య శాస్త్రంలో నోబెల్ బహుమతి పొందిన డా॥ ఖొరానాను మన దేశంలో ఉంచుకోలేకపోయాం అదే విధంగా చంద్రశేఖర్. ఇది విచారించాల్సిన విషయం అని పేర్కొన్నారు.

భారతదేశంలో పుట్టిన మేధావులు భారతదేశ కీర్తి ప్రతిష్టలు పెంచుతున్నారు. మనదేశంలో ఉండి పరిశోధనలు చేస్తే మనం ఇంకా గర్వించవచ్చు.

# స్వగతం నుండి స్వగతానికి

- డా॥ యు. ఏ. నరసింహమూర్తి

(క్రిందటి సంచిక తరువాయి)

గురజాడ పరిపూర్ణమైన ఆధునిక నాటకశిల్పం కోసం, ఒక కొత్త సంవిధానం కోసం ప్రయత్నం చేసేడు. బెంగాలీ నాటకకారుడు మైకేల్‌మధుసూదన దత్తాను గూర్చి కూడా ఇలాగే విమర్శలు చేసినప్పుడు ఆయన "The perhaps forget that I write under very different cirucmstances. Our social and moral developments are of a different character. We are no doubt actuated by the same passions, but inces those passions assume a mildder shape" [10] అంటూ తన దృక్పథం ఏమిటో వివరించుకున్నాడు. గురజాడ కూడా అంతే. ఆయన దృక్పథం ఏమిటో ఆయన పీఠికల్లో తెలుస్తుంది. ఎలిజిబెత్ కాలపు కామోడీలో ఉన్నంత అల్లరి క్వ్యాశుల్క్ లంలో ఎక్కడా కనబడదు. నార్లవారు ఒకచోట గురజాడ ఇబ్సెన్‌ను గుర్తించ లేక పోయారని విచారించి[11] ఇంకొకచోట ''నాటక కర్తల్లో ఇబ్సెన్, షా వీళ్లు గురజాడ మనస్సును తీర్చిదిద్దిన ఆధునిక యుగ ప్రముఖుల్లో కొందరని చెప్పవచ్చును''[12] అంటారు. 1910 ప్రాంతం వరకు బెంగాలీ, గుజరాతీ, మరాఠీ నాటక కర్తల దృష్టి ఇబ్సెన్ మీద పడనట్లుగా తెలుస్తూంది. "Ibsen and show them began to excercise a marked influence in plays like those of Mr. Varerkar after 1910" అని ఆర్. కె. యాజ్ఞిక్ అన్న మాటలు ఈ సందర్భంలో పరిశీలించదగినవి.[13] అంతకు ముందుగా తెలుగు నాటక కర్తలకు, ఇంకా చెప్పాలంటే భారతీయ నాటక కర్తలకు ఇబ్సెన్ పరిచయం లేదనుకోవాలి. ఇబ్సెన్ నాటక శిల్పాన్ని గుర్తించిన వాడైతే గురజాడ తన స్వగతాల శీలాన్ని ఇంకా ఇంకా మార్చుకుని ఉండేవాడు. ఆధునిక నాటకాన్ని గణనీయంగా ప్రభావితం చేసిన ఇబ్సెన్ స్వగతాలకు విముఖుడు. ఆయన స్వగతాలను నిర్లక్ష్యం చేసినందుకు విచారించిన విమర్శకులున్నారు.

రత్నావళి నాటిక విష్కంభంతో మొదలయింది. అదంతా యౌగంధరాయణుని స్వగతమే. తన రాజుకు సింహళ దేశపు రాజకుమారినిచ్చి వివాహం జరిపించాలని పథకం వేయడం, నౌకాభంగంలో ప్రమాద గ్రస్తురాలైన ఆమెను కౌశాంబీ వణిజులు సంరక్షించి తీసుకురావడం, యౌగంధరాయణుడామెను పట్టపురాణి కప్పగించడం మొదలైన వృత్తాంతమంతా ఇందులో వివరింపబడింది. అంతేకాదు. కౌశాంబీ ప్రజల మదన మహోత్సవ కోలాహలాన్ని వీక్షించడానికి రాజు ప్రవేశిస్తున్నాడనే సూచన కూడా చేయబడింది. ఆ సూచన కారణంగా రాజు విదూషకుడు ప్రవేశిస్తున్నట్లుగా తెలుస్తుంది. యౌగంధ రాయణుడు నిష్క్రమించిన తరువాత తెరపడి ఆ తర్వాత తెరతీచిన తరువాత రాజు విదూషకుడు ప్రవే శిస్తారు. ఇది భారతీయ సాంప్రదాయిక పద్ధతి ననుసరించి ఉంది. అసలు సాధారణంగా ఇటువంటి అర్థోపక్షేపకాలలో రెండు పాత్రలను ప్రవేశపెట్టడం ఆచారం. కాని ఇక్కడ ఒక్క పాత్ర స్వగతంతోనే అర్థోపక్షేపకరణ చేయడం జరిగింది. మృచ్ఛకటికం కూడా మైత్రేయుని స్వగతంతో ప్రారంభమవుతుంది. ''అథవా మయాపి మైత్రేయేణ పరస్యామన్త్రణ కాని సమీహితవ్యాని. హా! అవస్థే! తులయసి'' అన్న మైత్రేయుడి ప్రారంభ వాక్యాలు, ''ఉదయం కథ ఆలోచిస్తే యిటుపైని తిండి పెట్టేటట్టు కానరాదు.''

---

డా॥ యు. ఏ. నరసింహమూర్తి, విజయనగరం, మహారాజా కళాశాలలో తెలుగు శాఖాధ్యక్షునిగా పదవీ విరమణ చేసి, అక్కడే యు. జి. సి. ఎమిరిటస్ రీసెర్చి ఫెలోగా ఉంటున్నారు.

అన్న గిరీశం అవస్థకు దారి చూపించినట్లు కనిపిస్తాయి. చారుదత్తుడి యింట్లో షడ్రసోపేతమైన భోజనం చేస్తూ ''నగర చత్వర బలీవర్ద ఇవ రోమన్థాయమాన స్తిష్ఠామి'' అనుకుంటాడు మైత్రేయుడు. అంటే పీకమొయ్యా తిని నాలుగు రోడ్ల కూడలిలో అచ్చువేసిన ఆబోతులా తిరుగుతూ ఉండే వాడనని అర్థం. పూట కూళ్లమ్మ ప్రాపకంలో గిరీశం కూడా ఇలాగే ఉండేవాడు. చారుదత్తుడు దరిద్రుడు కావడం వలన మైత్రేయుడికీ, పూటకూళ్లమ్మకు కోపం రావడం వలన గిరీశానికీ అన్నం కోసం వెతుక్కోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇంట్లో తిని ఆబోతులా వీథులన్నీ తిరగడానికి బదులుగా, పెంపుడు పావురంలా బయటకు పోయి మేత మేసి తిరిగి ఇంటికి చేరుకోవలసిన పరిస్థితి ఇద్దరికీ సమానంగా ఏర్పడింది. సాయం సంధ్యా సమయంలోని మైత్రేయుడి స్వగతం గురజాడను ''సాయంకాలమైంది'' అనే ప్రారంభానికి ప్రోత్సహించి కృత్యాద్యవస్థను తప్పించింది. మైత్రేయుడు నాలుగడుగులు వేసి చూచి ''ఏష చారుదత్తః, సిద్ధీకృత దేవకార్యో బలిమాహరన్నిత ఏ వాగచ్ఛతి'' అంటూ, గిరీశం వెంకటేశం ప్రవేశాన్ని సూచించినట్లే, చారుదత్తుని ప్రవేశాన్ని సూచించేడు. చారుదత్తుడు గృహదేవతలకు బలి సమర్పించడానికి ప్రవేశిస్తే, వెంకటేశం గిరీశానికి సెలవుల్లో తిండి దొరికే మార్గంగా ప్రవేశించాడు. రెండు చోట్లా తెరపడకుండానే దృశ్యం కొనసాగడం కారణంగా ఈ స్వగతాలు అర్థోపక్షేపకాలు కాకుండా పోయాయి. ముందు ప్రవేశించిన పాత్రలతోనే దృశ్యం కొనసాగించడంలో శూద్రకుడు కొంత సాహసం చేసాడు. కన్యాశుల్కంలోని ప్రారంభ స్వగతానికి మృచ్ఛకటికంలోని ప్రారంభ స్వగతానికి ఇన్ని పోలికలున్నాయి. ప్రథమ కబళంలోనే మక్షికాపాత మన్నట్లు గురజాడ ఎలిజిబెత్ నాటక శిల్పాన్ని తప్ప ఇంకొక శిల్పాన్ని ఆలోచించ లేక పోయాడని వాదించేవారికి ఈ స్వగత కల్పన మింగుడుపడదు. మృచ్ఛకటికంలోని ఆధునిక రీతికి ముచ్చట పడిన గురజాడ ఈ స్వగతాన్ని కల్పించేడు. ఆయన ఒక శిల్పానికి బానిసగా ఎప్పుడూ కనబడడు. ఆ లక్షణమే ఉంటే ఇటు శూద్రకుణ్ణి చూసైనా, అటు షేక్స్పియరును చూసైనా ఒక నిద్రాగత స్వగతాన్ని కల్పించి ఉండేవాడు. శర్విలకుడు దొంగతనానికి వచ్చినప్పటి మైత్రేయుని నిద్రాగత స్వగతం రంగస్థలం మీద అద్భుతంగా రక్తి కడుతుంది. అటువంటివి షేక్స్పియరు సింబలిన్ నాటకంలోను, ఇతరత్రా ఉన్నాయి. వాటిని చూచి గురజాడ ప్రలోభ పడలేదు. అందుకే కన్యాశుల్కం నాటకంలో నిద్రాగత స్వగతం లేదు. షేక్స్పియరు స్వగతానికి మామూలు సంభాషణకు ఛందస్సులో భేదం చూపిస్తాడు. గురజాడ అటువంటి భేదాన్ని చూపించలేదు. స్వగతంలోను, సంభాషణలలోను భాష ఒకే మాదిరిగా ఉంటుంది. శైలి, గమనం ఒకేలా ఉంటాయి.

ప్రవేశ స్వగతాలలో కథనాత్మక స్వగతాలు, వివరణాత్మక స్వగతాలు అని రెండు రకాలుంటాయి. గిరీశం ప్రారంభ స్వగతం వివరణాత్మకమైనది. ఇందులో కొంత కథనం ఉన్నా పాత్ర గుణశీలానికి ప్రాధాన్యం కనిపిస్తుంది. ప్రథమాంకం రెండవ రంగంలోని మహేశం స్వగతం కేవలం వివరాణాత్మకం. తృతీయాంకం మొదటి రంగంలో మధురవాణి ప్రారంభ స్వగతం ఒకటుంది. అది కథనాత్మక స్వగతం. రామప్పంతులికి సంబంధించిన కథంతా అందులో ఉంది. అందులోని ''తెలియక మోసపోతినే'' అన్న చరణాన్ని రామప్పంతులు వినడంతో దీనికి అతిశ్రుత స్వగత (overhead soliloquy) లక్షణం కూడా సంక్రమించింది.

కన్యాశుల్కంలో గిరీశం స్వగతాల కంటె బలీయమైనవి, సహజమైనవి లుబ్దావధాన్ల స్వగతాలు. పంచమాంకం ఒకటవ రంగంలో ''ఓపన్నం యాకర బెట్టేదా? గాయత్రీ స్మరణ చేసేదా?'' అన్నది ''యీ ముండ నా యింట్లోంచి విరగడై పోతేనే గాని యీ పిశాచం వొదిలిపోడు'' అన్నది ''గుండు గొమ్ముల అనుమానం తీరిపోయింది'' అన్నది, మూడవ రంగంలో ''కనబడకపోతే యేవైనట్లు'' అన్నది, అరవ అంకం నాల్గవ రంగంలో ''ఏమి దురవస్థ వచ్చింది?'' అన్నది లుబ్దావధాన్ల స్వగతాలు. ఈ స్వగతాల వెనుక ఒక భీభత్స వాతావరణం ఉంది. రెండో పెళ్లి పెళ్లాం, దాని మొదటి పిశాచం మొగుడు, భార్య అదృశ్యం, ఆత్మ హత్యాశంక, ప్రాణభయం, పోలీసులు, కోర్టులు, సంఘం కల్పించే భయాలు, పశ్చాత్తాపం, పరిణామం - ఇలా ఎన్నో లుబ్దావధాన్ల పాత్ర నంటిపెట్టుకుని ఉన్నా గాఢ మానసిక వేదనలు అత్యంత సహజంగా ఈ స్వగతాల్లో కనిపిస్తాయి. స్వగతాలను కల్పించడానికి ఇంతకంటే అనువైన స్థలాలుండవు. ఇవి లోకంలో ఎంతో సహజంగా ఉండి నాటకంలో ఇంకా రాణిస్తాయి. సహృదయులలో ఒక పాత్ర పట్ల సానుభూతి, కారుణ్యం పెల్లుబికి సన్నివేశాన్ని రసార్ద్రం చేయగల శక్తి ఇటువంటి స్వగతాలకు సిద్ధిస్తుంది. హాస్య పక్షం నుండి చూస్తే ఈ స్వగతాలలో లుబ్దావధాన్లు Cuckoldగా కనిపిస్తాడు. ఎవడి భార్య ఇంకొకడితో పోతుందో వాణ్ణి పాశ్చాత్యులు Cuckold అంటారు. తెలుగు సాహిత్యంలో ఇలాంటి స్థితి అరుదు. మరణం - ఆత్మహత్య వంటి సన్నివేశాలు స్వగతాల కనువైనవి. ఒక వ్యక్తి మరణించకుండానే మరణించినట్లు భావిస్తూ కొనసాగించే స్వగతాలుంటాయి. నాల్గవ హెన్రీ నాటకంలో ఫాల్‌స్టాఫ్ చనిపోయాడనుకున్న కారణంగా ఇటువంటి స్వగతం ఒకటి కల్పించబడింది. లుబ్దావధాన్ల స్వగతాలు అటువంటి స్థితినుండి పుట్టుకొచ్చేయి. ఇటువంటి స్థితిలో పాత్ర భయోత్పాతానికి లోనవుతూన్న కొద్దీ ప్రేక్షకుల్లో హాస్యం వెల్లివిరుస్తూ ఉంటుంది. ఆ పాత్ర భయానక స్థితిపట్ల సహృదయుడు సానుభూతిని కనబరుస్తూనే హాస్య రసాస్వాదన చేయడానికి ఇటువంటి స్వగతాలు ఉపకరిస్తాయి. కథనం - వివరణం అనే లక్షణాల కంటె లుబ్దావధాన్ల స్వగతాలలో ఆత్మ విమర్శ, యుక్తా యుక్త విచక్షణ అనే లక్షణాలు గాఢంగా కనిపిస్తాయి. ఇవి అనువైన స్వగత లక్షణాలు. స్వగతంలో హృదయకవాటాలు భళ్ళుమని తెరుచు కుంటాయి. ఇతరుల ముందు వెల్లడించుకోలేని ఎన్నో సంగతులు మనిషి తనకు తానుగా వెల్లడించుకుంటాడు. స్వగతం ఒంటరితనానికొక రూపాన్నిస్తుంది. ఊరటను కల్పిస్తుంది. అత్యంత రహస్యానుభూతులే కాదు, దృఢతరమైన నిర్ణయాలు కూడా స్వగతాలలో ఏర్పడతాయి. వ్యక్తి జీవన నాటకంలోని గంభీరమైన పరిష్కారాల నెన్నింటినో ఏకాంతంలో ఒంటరిగా సాధిస్తాడు. ఆ లక్షణాలన్నీ మనకు లుబ్దావధాన్ల స్వగతాలలో కనిపిస్తాయి.

15,16 శతాబ్దాలనాటి ఫ్రాన్సుదేశపు ప్రహసనాలలో భార్యను అనుమానించే మూడురకాల పాత్రలున్నాయి, వాటి స్వగతాలున్నాయి. భార్యను గూర్చి ఆందోళన పడే పాత్రలు, వాటి స్వగతాలు తొలిదశలోని ఆంగ్ల ప్రహసనాలలో కూడా కనిపిస్తాయని Morris Le Roy Arnold (The soliloquics of Shakesphere. A steady in Teachinc P116) వివరించారు. 1 వైవాహిక బంధంలో ఏర్పడిన అసంతృప్తి. 2. భార్యను అనుమానించడంలో మీసం మెలితిప్పుకొనే ఆలోచనలు. 3. భార్య శీలాన్ని గూర్చిన లేనిపోని ఆలోచనలతో కష్టాన్ని కొనితెచ్చుకోవడం అనే మూసలో

తయారైన పాత్రలు చాలా అసంగతమైన స్వగతాలతో యూరపులో నాటకశాలలు మూతపడే దాకా కొనసాగాయని తెలుస్తూంది. తిరిగి పునరుద్ధరణకాలం నాటి హాస్య నాటకాలలో ఈ ధోరణి కొంత తల ఎత్తింది. లుబ్ధావధాన్లు భార్యను అనుమానించడం, భార్య కారణంగా భయగ్రస్తుడవడం, పశ్చాత్తాపపడడం, పరిష్కారాన్వేషణ చెయ్యడం వస్తువులుగా గల స్వగతాలలో ఎక్కడా అసంగత స్వగత (Absurd soliloquy) లక్షణం కొంచెం కూడా కనబడదు. ఆ స్వగతాలను అత్యంత సహజంగా తీర్చిదిద్దడంలో గురజాడ కృతకృత్యుడై సహజమైన హాస్యాన్ని సృష్టించగలిగేడు.

స్వగతాలను అభివ్యక్త స్వగతాలు (Verbal soliloquies), ఆలోచనాత్మక స్వగతాలు (Mental soliloquies) అని వర్గీకరించారు. నాటకాలలో అభివ్యక్త స్వగతాలెక్కువగాను, ఆలోచనాత్మక స్వగతాలు తక్కువగాను ఉంటాయి. కన్యాశుల్కంలో లుబ్ధావధాన్ల స్వగతాలన్నీ ఆలోచనాత్మక స్వగతాలే. లుబ్ధావధాన్లు తనలో తాను పడ్డ మథనమంతా వాటిలో కనిపిస్తుంది. గిరీశం స్వగతాలు అభివ్యక్త స్వగతాలు. ఆ స్వగతాల్లో గిరీశం తనలోతాను మాట్లాడుకుంటున్నట్లు, తర్కించుకుంటూన్నట్లు, లాభనష్టాలు బేరీజు వేసుకుని కార్యాచరణకు పూనుకుంటూనట్లు కనిపిస్తాయి గాని గిరీశం అంతర్మథనాలుగా కనబడవు. అంతఃకరణం అంటూ ఒకటున్నప్పుడే ఆలోచనాత్మకస్వగతాలుంటాయి. లుబ్ధావధాన్లకు అంతకరణం ఉంది. అవకాశవాది అయిన గిరీశానికి అంతఃకరణమంటూ ఒకటి లేదు. అందుచేత అతని స్వగతాలు ఆలోచనాత్మక స్వగతాలు కావు. గిరీశం సుదీర్ఘ అభివ్యక్త స్వగతంలో ''టు మారీ యె విడో, ఆర్ నాట్ టు మారీ, దటీజ్‌ది క్వశ్చన్! ''షేక్స్పియర్ పడ్డ అవస్థలో పడ్డాం'' అని చెప్పడంతో గురజాడ స్వయంగానే ఆ స్వగతంపై గల షేక్స్పియరు ప్రభావాన్ని అంగీకరించి నట్లైంది. ఇలాంటి స్వగతం షేక్స్పియరుకు ముందుగా 'మృచ్ఛకటికం' లో శర్విలకుని చౌర్య ప్రయత్నంలో కనిపిస్తుంది. ఐనా ఇక్కడ షేక్స్పియరు ప్రభావం ప్రకటంగా కనిపిస్తుంది. ''కాముని విరిశరముల బారికినే, నేమని సహింతునే' చెలియేమని సహింతునే అనే పాటతో గిరీశం స్వగతం ప్రారంభ మవుతుంది. ఇలాంటి పాటలతో ప్రారంభమయ్యే స్వగతాలు షేక్స్పియరు నాటకాలలో కనిపిస్తాయి.

"When a man is soliloquy reasons with himself, and pro's and con's and weighs all his designs, we ought not to imagine that this men either to us or to himself, he is only thinking, and think such matter as were inexcesable folly in him to speak" అన్న William Congreve (S.S. P 18) పరిశీలన గిరీశం సుదీర్ఘ స్వగతం విషయంలో బాగా అన్వయిస్తుంది. హాస్యనాటకాలలోని అభి వ్యక్త స్వగతాలు సరాసరి ప్రేక్షకుల నుద్దేశిస్తూన్నట్లున్నప్పుడు బాగా రక్తి కడతాయి. ''తస్సాగొయ్యా, వీడి బాణాలు పువ్వులటోయి?'' అనేటప్పటికి గిరీశం సూటిగా మనతో మాట్లాడుతున్నాడనే భ్రమ కలుగుతుంది. అవాకులు చెవాకులు పేలడానికి అలవాటు పడ్డ గిరీశం నైజం అతన్ని అలాంటి సంభాషణలోకి దింపిందే కాని అది మనకోసం మాట్లాడిందేం కాదు.

*(ఇంకా వుంది)*

# కీట్సు కవిత్వం - అంతర్ధ్వని

- శివలింగం

ఆనందవర్ధనుడు కావ్యాత్మ ధ్వని అన్నాడు. ధ్వని ద్వయంగా చెప్పాడు. వాచ్యం, ప్రతీయమానం. వాచ్యం కావ్య శరీరం అయితే ప్రతీయమానం కావ్యాత్మ అవుతుంది. జాన్ కీట్సు (1795-1821) పద్యాలలో అంతర్గతంగా వున్న ఆత్మధ్వని వినిపిస్తూ వుంది. మనలో వున్న సందేహాలన్నీ సమసి పోయి గుండెనిండా సౌందర్యాన్ని నింపి సత్యాన్ని ఆవిష్కరింప చేస్తుంది. చిన్నతనంలోనే పరిణతిని సాధించిన మహాకవి. నిశ్శబ్ద విషాద సంగీతం. అధి భౌతిక ప్రశ్నలతో గాని, ఆత్మతో గాని కీట్సు యిబ్బంది పడలేదు. మానవ అనుభవాన్ని నైతిక వ్యాఖ్యానం చేసే స్థాయికి కీట్సు మేధస్సు ఎదగలేదని ఆర్నాల్డు అన్నాడు. కాని జీవితం పట్ల నైతిక అంతర్దృష్టి గాఢంగానే వుంది. మానవుడు ప్రకృతి, మానవ జీవితం మీద కవిత్వంలో వ్యక్తమైన భావాలు అనుభవం మీద, అవగాహన మీద ఆర్జించినవేగాని పుస్తక పఠనం వలన కాదు. కవిత్వంలో కాఠిన్యత, అనిర్వచనీయత, సౌందర్య సంపద కవిత్వంలో కనిపిస్తాయి. నైతిక భావాల మీద తిరుగుబాటు చేసే కవిత్వం జీవితంమీద తిరుగుబాటుచేసే కవిత్వ మౌతుంది. నైతిక భావాలను అంగీకరిస్తే జీవితాన్ని అంగీకరించడం. కీట్సు జీవితాన్ని తిరస్కరించలేదు, జీవితం మీద ప్రేమ వుంది, జీవితాన్ని ఆదర్శంగా భావించలేదు, వాస్తవికంగా దర్శించాడు. ఎక్కడో దూరంగా కుటీరంలో ఏకాంత ధ్యానంలో దర్శించింది కాదు. భౌతికంగా అనుభవించి గ్రహించిన జీవిత ప్రేమావగాహన. కీట్సులో సంకీర్ణ మనస్తత్వం లేక పోలేదు. ఇంద్రియానుభూతికి ఆలోచనకూ మధ్య అవగాహన ఫలితంగా తాత్విక మనస్తత్వం ఏర్పడింది. కవిత్వం ఇంద్రియాను భూతిని అధిగమించి ఆధ్యాత్మికానుభూతిలోకి పయనిస్తుంది. చెవికి వినబడని రాగం వినిపిస్తుంది కంటికి కనబడని సత్యం కనిపిస్తుంది. మానవ దుఃఖ రహస్యాలను అన్వేషించి కనుగొన్నాడు కవి. 'సౌందర్యంతో ఆమె ఆనంద దేవాలయంలో నివాసం. ఆచ్ఛాదిత శోకం ఆమె ఆరాధ్య దేవత.' ఇది కాల్పనిక కవుల దర్శన కాదు. ఆత్మానందానుభవ దర్శన. మృదు నయనం. అరోరియన్ ప్రేమోదయం - ఆత్మ నయనం తెరుచుకుంది. ఆలింగనం, సగంముద్దులిడే ప్రేమికులు సిగ్గు, చల్లదనం, పూలు, సువాసన, నయనాలు. ఆత్మ అమాయకత్వానికి ఆనందంతో కూడిన అనుభవానికి సంకేతాలు. ఆనందంలో విషాదం. విషాదంలో ఆనందానుభూతి. సైక్ ఒక విషాద నాటకం. సైక్ ఏకాంతానికి దుఃఖాత్మకు ప్రతీక, బాధ కవికి వస్తువు కాదు. ఆత్మ శుద్ధికి, ఆత్మ దర్శనం పొందడానికి కావలసినది. "I see and sing by my own eyes inspired' ఇది వైయక్తిక ప్రేరణ వలన కలిగిన కాల్పనిక విశ్వాసం. ప్రపంచ మానవుని నైతికతను నిరంతరం పరిశీలించే కళ్ళు. విషాద నాటక జీవితానికి సాక్షీభూతం. దుఃఖంలోనూ ఆనందంలోనూ కన్నీళ్ళొస్తాయి. సుఖదుఃఖాలు రెండూ ఒకటే. జీవితం విషాదమని భావించినపుడే జీవించడం ఆరంభిస్తామని యేట్సు. హేతువును విశ్వాసాన్ని కలిపి విషాదంలోంచి ఆనందం పొందడమే లక్ష్యం. కళ్ళు విషదానందాశ్రువులకు సంకేతం. సైక్ పద్యాలు కాలసంబంధం కాదు. కర్మేంద్రియమూ కాదు. బాధలో స్నానం చేసి శుద్ధి అయిన ఆత్మకు, ఏకాంతానికి ప్రతీక. శుద్ధ ఆనందానికి సంకేతం నైటెంగేల్. క్షణికమైన జీవితం నుండి, భయం నుండి విముక్తి పొందడం

---

శివలింగం, చల్లపల్లికి చెందిన ప్రసిద్ధ చింతనా శీలి

సూచిస్తుంది. షెల్లీ స్కైలార్క్ ఈ కోవకు చెందిందే. భ్రాంతి మయమైన క్షణిక సుఖం కవిని 'జ్వరం' నుండి కొన్ని క్షణాలైనా రక్షిస్తుంది.

పాదాల వద్ద ఏ పూలున్నాయో, కొమ్మల్లో ఏ మృదు సౌరభాలు వేలాడుతున్నాయో చూడడు. వాసనాంధకారం అలముకొనండం వలన చూడలేడు. తరవాత మరణాన్ని దర్శిస్తాడు. ఆనందంలో మరణించడం ఒక గొప్పవరం, అదృష్టం. ఎమిలీ డికిన్సన్ కూడా మరణం కోసం నేను ఆగలేదు, అదే నా కోసం ఆగిందన్నాడు. దుఃఖ విముక్తికి మరణాన్ని స్వాగతించాలి. మరణం మీద సగం ప్రేమ వున్నది. ఇప్పుడు పూర్తి ప్రేమ కలిగింది. జీవితమే సౌందర్యం. సౌందర్యమే సత్యంగా దర్శించడమే జీవితం. కవికి జీవితం మీద వున్న ప్రేమను పరిపూర్ణంగా సుసంపన్నంగా ఆటమ్ పద్యాల్లో చూడగలం. ఋతువును ధ్యానించడం జీవితాన్ని ధ్యానించడమే. mists, maturing sun - morning of life బాల్యం తరవాత మధ్యాహ్నం యౌవనం మూడోది వృద్ధాప్యం.

Barred clouds which bloom the soft dying day sun set of lifeకు ప్రతీకలుగా భావించాలి.

Eve of St. Agnes పద్యాల్లో చల్లని వాతావరణాన్ని వర్ణించాడు. చల్లదనం నిశ్శబ్దాన్ని, నిశ్చలనాన్ని తెలియచేస్తుంది. మరణానికి కూడా ప్రతీక. చలనం, వెచ్చదనం జీవితానికి ప్రతీక.

Sermons in stones
Books in running brooks అని షేక్స్పియరన్నాడు. సంప్రదాయ వాదులు మార్చారని చదివాం. కీట్సు రెండో పద్యంలో ధ్వన్యాత్మకంగా వ్యంగ్యంగా వర్ణించాడు. పరిపూర్ణమైన ప్రేమను వ్యక్తీకరించాడు.

కీట్సు రొమాంటిక్ కవులలో అగ్రగణ్యుడు. శైలిలోను, రూపంలోను రామణీయకత రూపుదిద్దుకుంది. ద్విపదను తిరస్కరించాడు. సమకాలీన విప్లవోత్సాహంగాని, సాంఘిక ఊర్ధ్వచలనాన్ని పట్టించుకోలేదు. కీట్సు ప్రభావంతో సమకాలీన జీవితానికి దూరమయింది కవిత్వం. గతంలోకి మళ్ళింది చూపు. సౌందర్యారాధన పెరిగింది. రొమాంటిక్ కవులలో చివరి వాడుగా కనిపిస్తాడు. ఆ యుగం పూర్తి. తరవాత తరం మీద కీట్సు ప్రభావం బలంగానే ప్రసరించింది. కీట్సుది శుద్ధ కవితాత్మ. ఆయన దృష్టిలో కవిత్వం తత్వంకాదు, ధర్మ ప్రబోధం కాదు. సాంఘిక రాజకీయ సిద్ధాంతాలు కాదు. కవిత్వం సౌందర్య అవతారం. అన్నిటిలోనూ వున్నది సౌందర్యమే అంటే అంతా సౌందర్యమయం అన్న సూత్రాన్ని నేను ప్రేమిస్తానన్నాడు. కీట్సు జీవితం విషాద సౌందర్యం. సౌందర్యంలోనే సత్యాన్ని దర్శించాడు. ప్రపంచ సాహిత్యంలో కీట్సు కవిత్వం అజరామరం.

"Published with Financial Assistance from the Central Institute of Indian Languages, (Ministry of Human Resource Development, Dept. of Secondary and Higher Education, Govt. of India) Manasagangotri, Mysore - 570 006 vide sanction Letter No. F. 53-1/2001-2002/LM/GRNT dated 19th March, 2002 under the scheme of Grant-in-Aid L.M."



చిత్రం : న్యూటన్ (1795) , చిత్రకారుడు : బ్లేక్

బ్లేక్ దృష్టిలో న్యూటన్ అంటే హేతువాది. హేతువాదం అపాయకరమైంది బ్లేక్‌కు. జీవితం మొత్తాన్ని వృత్తాంశ లేఖిని (Devider) తో కొలవచ్చునంటాడు న్యూటన్. అంటే జీవితంలో హేతువుకు అందనిది ఏదీ లేదని న్యూటన్, అలా అనుకోవడమే ప్రమాదం, అందనివి కూడా ఉన్నాయని బ్లేక్ అన్నాడు.

MISIMI/ మిసిమి RNI Regd. No.45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd.No.H/SD/191.



**చిత్రం : సైతాను, పాపం మరియు మృత్యువు, చిత్రకారుడు : బ్లేక్**

మిల్టన్ రాసిన 'పేరడైజ్ లాస్ట్' బ్లేక్‌ను ఎంతగానో కదిలించింది. ఈ జలవర్ణ చిత్రంలో కిరీటి సైతాన్ మృత్యువుతో పోరాటానికి సిద్ధమయ్యాడు. అప్పుడు పాపం జోక్యం చేసుకొని "మృత్యువు అనేది ఎవరో కాదు. మన బిడ్డడే" అని చెబుతుంది.